శ్రీ

# విజయనగర సామ్రాజ్యము

( చరిత్రాత్మకము )


గ్రంథకర్త:
భాషాప్రవీణ:
**తణుకు రామారావు,** బి. ఒ. యల్.
ఆంధ్ర ప్రధానోపాధ్యాయుడు
మహాత్మాగాంధి ఉన్నత పాఠశాల,
ఆత్రేయపురము.



ప్రకాశకులు:
గౌతమీ కళాపరిషత్తు
ఆత్రేయపురము.
తూర్పు గోదావరి జిల్లా.

# ★ పీఠిక ★

(ఆంధ్ర విద్యాభూషణ, శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు M.A.

పావన మహనీయ విషయములపై బుద్ధి ప్రసరించుట పురాకృతసుకృత విశేషముననే కాని సంభవింపదు. ప్రాయికముగా రచయితలు అల్పాల్ప విషయములను ఎత్తికొనుచున్న యీ కాలములో శ్రీ తేఱుకు రామారావు తన రచనాశక్తిని విజయనగర సామ్రాజ్య చరిత్ర సంగ్రథనముపట్ల వినియోగించుట అత్యంతము అభినందనీయము.

ప్రాచీన భారతీయ ధర్మసంస్కృతులు దక్షిణ భారత దేశమున ఉత్పన్నములు కాఁగల సూచనలు కన్పట్టినప్పుడు శ్రీ మాధవాచార్య విద్యారణ్యులవారు వానిని రక్షించుటకై అపార శేముషీ వైభవముచే నెలకొల్పిన విజయనగరరాజ్యము భాగతీయాత్మను మహావిపత్తునుండి రక్షించినది. అల్లాయుద్దీను దండయాత్రవలన ఓరుగల్లు సామ్రాజ్యము విచ్ఛిన్నమగుటతో బాటు అచట ఫలపుష్పభరితమై యేపుగా పెరిగియున్న భారత సంస్కృతి మహావృక్షముకూడ నేలఁగూలినది. ఇట్టి ప్రమాద మితరదక్షిణాత్య ప్రాంతములకుఁగూడఁ బ్రాకనున్న సమయమున ఇన్నూరు సంవత్సరము లవిచ్ఛిన్నముగ విధ్వంసకశక్తుల నెదిర్చి ధర్మసంస్కృతి రక్షణమును గావించుటయేకాక ప్రజల శాంతి భద్రతలను గాపాడి సకలవిధాభివృద్ధిని సాధింపఁగల్గిన రాజ్యము నెలకొల్పఁబడుట భారతదేశచరిత్రలో స్వర్ణాక్షరములతో లిఖింపఁదగిన ఘట్టము. హరిహరరాయలు, బుక్క

రాయలు మున్నగు మహామహులీరాజ్యమున కధినేతలై తమ ధర్మమును లోకోత్తర ప్రతిభాసామర్థ్యములతో నిర్వహించి యజరామరకీర్తిని సంపాదించుకొనిరి. నేటికిని ఉత్తర దేశములో కంటె దక్షిణదేశములో వైదిక సంస్కృతి హెచ్చుగా నిలుచుటకుఁ గారణము విజయనగర రాజ్యస్థాపనమే కాని మఱొకటికాదు.

విజయనగర రాజులు కేవల జాతీయమైన పద్ధతితో, మన్వాదుల వ్యవహారకాండను, శుక్రనీతి, కామందకనీతి కౌటిల్యార్థశాస్త్రాది గ్రంథముల ననుసరించి పరిపాలన సాగించిరి. వారి పరిపాలనమున కళలు, కవితలు, వేదభాష్యములు, సాహిత్యము, శాస్త్రములు అమృతప్రవాహముగా విరిసినవి. వ్యవసాయము, వాణిజ్యము మున్నగు వృత్తులున్నతస్థితి నందుకొన్నవి. నీటిపారుదలకు నదులనుండియు, వాగులనుండియుఁ గాలువలు త్రవ్వబడి వ్యవసాయ క్షేత్రములను సస్యశ్యామలములను గావించినవి. విజయనగర పట్టణమందలి ఆపణములలో రత్నములు, వజ్రములు కుంచములతోఁ గొలచి యమ్మఁబడుచుండుటను స్వయముగాఁ జూచితినని యానాటి పాశ్చాత్య యాత్రికుడొకడు వ్రాసినాఁడు. విజయనగరమంతటి మహాపట్టణమును గన్నెన్నడును జూడలేదనియుఁ జెవి యెన్నడు వినలేదనియు టావర్నియర్ అను ఇటాలియను యాత్రికుడు వ్రాసియున్నాడు. విజయనగర రాజుల పరిపాలనా పద్ధతులనే తరువాతి మహారాష్ట్ర దేశ పరిపాలకులును అనుసరించినారని శ్రీ లోకమాన్య తిలకుగారు తెలిపియున్నారు.

అట్టి మధురస్మృతి భరితమైన యైతిహ్యమును సంగ్రహముగాఁ దేటతెల్లని గ్రాంథికభాషలో రచించి (శ్రీ) రామారావు చరిత్రాంశములకు సారస్వత సౌరభమును గూర్చినాడు. విషయబాహుళ్యము భాషాపాటవము గల్గిన యీ గ్రంథము నాంధ్రులెల్లరు నాదరింతురనియు, గ్రంథాలయములలోను, పాఠశాలలలోను విశేషప్రచారము నీగ్రంథ మొందఁగలదనియు విశ్వసించుచున్నాను.

విజయవాడ<br>25-12-56

(సం) జటావల్లభుల పురుషోత్తము. ఎం. ఏ.<br>ఆర్షవిద్యాభూషణ, ఉపన్యాసకులు.<br>ఎస్. ఆర్. ఆర్. & సి. వి. ఆర్. కళాశాల.



Professor Rallabandi Subba Rao,

M. A., L. T., M. R. S. (Rtd.)

President

The Andhra Historical Reasearch Institute,

Rajahmundry.

ఈ విజయనగర సామ్రాజ్యమను చిన్నచరిత్రను ప్రకటించిన శ్రీ తణుకు రామారావు చాలాకాలముగా నాకు తెలుసును. చాల సంవత్సరములుగా ఆత్రేయపురం ఉన్నత పాఠశాలయందు తెలుగు పండితులుగా ఉండి, చారిత్రిక విషయములు తెలుసుకొనుచు, బాలురకుపయోగించునట్లు ఈ చిన్న గ్రంథమును వ్రాసిరి. అందుకుగాను ప్రథమమున నా వ్యాసములును (ఈ విజయనగర చరిత్రకు సంబంధించినవి) కొన్నిటిని వారికిచ్చియు, మరికొన్ని చిన్న గ్రంథములు చదువను సలహా ఇచ్చియు, వారికి తోడ్పడితిని. ఆ కారణమున నన్నీ పీఠిక వ్రాయ గోరిరి. ఈ గ్రంథమునందు చారిత్రిక నవలను బోలిన రీతిని శైలి, చారిత్రిక విషయములు, పొందుపరచబడినవి. అందరకును విజయనగర సామ్రాజ్యచరిత్రను సులభశైలిని, ముఖ్యవిషయములు గమనించుచు చదువుకొనుటకు వీలుగానుండునట్లు ప్రకటించిరి. కొన్ని విషయములు మార్చుటయు, మరికొన్ని విషయములు; ముఖ్యముగా భాష, వాఙ్మయాభివృద్ధి, కళలు ఇంకను చేర్చుటయు, రెండవకూర్పునందు జరుగగలవు. మరియు, ఒకటి రెండు భూగోళపటములును కొన్ని దేవాలయములయొక్కయు, శిల్పములయొక్కయు బొమ్మలను ఈ గ్రంథమునందు చేర్చిన బాగుండును.

(సం) రాళ్ళబండి సుబ్బారావు.

27-12-56

జాతీయ భావములు సౌష్ఠవముతో పరిపుష్టి జెందవలె నన్న చరిత్రపఠనమే శరణ్యము. పాశ్చాత్య తేజములతో భారతీయ సాంస్కృతిక తేజఃపుంజముల దశదిశల బ్రసరింపజేసి విస్మృతతత పథమున బడిన జీర్ణ విజయనగర మహాసామ్రాజ్య వైభవమును తిరిగి మన స్మృతి పథమున రమ్యమైన కావ్య శైలిలో రూపింపజేసిన శ్రీ తణుకు రామారావుగారు స్తవనీయులు.

ఆంధ్రమున నలుమూలల నిది యాదరాభిమానముల నందగలదని యాకాంక్షించి యాశీర్వదించుచున్నాను.

శ్రేయస్కాముడు
గొడవర్తి సూర్యనారాయణ.
ఎం. ఎ. (ఆనర్సు) బి. ఇడి.,
అసిస్టెంటు లెక్చరరు. గవర్నమెంటు ట్రైనింగు కాలేజి.
రాజమండ్రి.



విజయనగర మహా సామ్రాజ్య చరిత్ర ప్రతిహిందువు డును అందుముఖ్యముగా ప్రతి ఆంధ్రుడును తెలిసికొనవలసినది. మహమ్మదీయుల విజయముల నరికట్టి హిందువుల నాగరికతను నాశనముకాకుండ ఇప్పటివఱకు పెంపొందింపజేసినది ఈ విజయ నగర మహా సామ్రాజ్యము నేలిన మహారాజులే. ఈ సామ్రా జ్యము నెలకొల్పబడనిచో హిందూజాతి గౌరవప్రతిష్ఠలు ఏనాఁడో అడుగంటి యుండెడివి.

మన పాఠశాల ఆంధ్రప్రధానోపాధ్యాయుడు శ్రీ తణుకు రామారావు గారిచే అందఱకు పఠనమునకు వీలుగా సులభశైలిని ఆ కాలములో సంస్కృతి, నాగరికత, మతధర్మ ములు, విద్యానిలయములు, దేవాలయ శిల్పములు, రాజ కీయ సాంఘిక పరిస్థితులు ఎట్లు అభివృద్ధి పొందినవియో సొంపుగ పొందు పఱచబడి, ఆంధ్రజాతికి ఆదర్శప్రాయముగ నుండునట్లు రచింపబడినవి. విజయనగర సామ్రాజ్యము నేలిన మహారాజులలో స్వతంత్ర దేశాభిమానము, సనాతన మత ధర్మ పునరుద్ధారణము, భాషాభిమానము, తిమ్మరుసుమంత్రి రాజకీయ చతురత, న్యాయపరిపాలన, సేనానాయకులైన యాచమనాయక విశ్వనాధనాయకుల శౌర్యసాహసములు శాంతి ప్రియత్వమును మనస్వతంత్ర భారతావనికి మార్గదర్శ కములై యున్నవి. హిందూదేశమంతయు అంధకారావృతమగు సమయములో ఈ మహాసామ్రాజ్యస్థాపనము ఒక విద్యుత్తు ప్రసరింపజేసినది. ఇట్టి చారిత్రిక ప్రసిద్ధమైన కథలోని మహా రాజుల జీవిత విశేషములను చదివిన విద్యార్థి లోకమునకే

గాక తదితరులకుగూడ మేలుకలిగి మనకు ఆదర్శమూర్తుల త్యాగఫలితముగా జేకూరిన స్వాతంత్ర్యము నిలబెట్టుకొని, దీని ఫలము ననుభవించుటకును, త్యాగ శౌర్య దీక్షాపరత్వము నలవఱచుకొనుటకు వీలగును.

ఇట్టి గ్రంథమును సాహిత్య దీక్షాపరులు, విద్యావేత్తలు తగురీతిని ఆదరించి ఈ గ్రంథకర్తకు ఉత్సాహప్రోత్సాహములు కలుగజేయుదురుగాక.

ఈ గ్రంథకర్త యింకను సాహిత్యకృషిసల్పి ఆంధ్రాన్నత్యము పెంపొందింపజేయు గ్రంథములను రచించుటకు ఆయురారోగ్యములు పరమేశ్వరుడు ప్రసాదించుగాక!.

ఆత్రేయపురం
31-12-56

(సం) P. P. రాఘవాచార్య B,Sc.B.Ed.
ప్రధానోపాధ్యాయుఁడు,
మహాత్మాగాంధి ఉన్నత పాఠశాల.



# ★ శుభాకాంక్షలు ★

" శ్రీ విజయనగర రాజ్యము "
నా విష్కరణంబుఁజేసె ♦ నార్షావనుఁడౌ
ఆ విద్యారణ్యుండే
ఈ విధి బురుషోత్తమాఖ్య ♦ నెగడుచు మరలన్॥

వరవిజయ నగర సామ్రా
జ్యరచన మిది వెలయుఁగాత ♦ చంద్రుఁడు తారల్
ధరయుండు నంతకాలము
పురుషోత్తముఁడైన రాఘ ♦ వుని దయఁగల్మిన్।

భావిభారత జాతీయ ♦ పౌరులార!
భవ్యమాంధ్ర సామ్రాజ్య ♦ పతనహేతు
భూతములు రెండు; అసహాన ♦ మును నసైక్య
తయును; [illegible] ♦ ...సఁపరయ్యా!

వాడ్రేవు శేషగిరిరావు.
చోప్పెల్ల.



# ★ నివేదిక ★

జాతి పునరుజ్జీవనమునకు వలయు ముఖ్యాంగములలో చరిత్ర జ్ఞానమొకటి. నన్నా భావమే యీరచనకుఁబురికొల్పినది. మానవుని జీవితము భౌతికముగ మానసికముగ అధ్యాత్మిక ముగ సామరస్యము నందవలయును. అట్టి మేల్మికల్మి నొన గూర్చుటకు విజ్ఞానైకలక్ష్యమగు చరిత్ర పఠనము సర్వులకు శరణ్యము. భాషాసూత్రమున చరిత్రను పొదిగి సర్వాంగ సుందర విషయ విలసితముగ నీ చరిత్రాత్మకకృతి నాచే రచింపఁ బడినది. ఇయ్యది పాఠకుల హృదయకుహరములందానంద తేజమీయఁగలదని ఆశింతును.

ఈ గ్రంథరచనకు ప్రధానాచార్యులు శ్రీ కె. ఎ. నీల కంఠశాస్త్రి. సి. యస్. శ్రీనివాసాచారి, సీవెలు దొరగార్ల ఆంగ్ల కృతులు, తదితరములును నాకెంతయో తోడ్పడినవి. వారికి నేను త్రికరణశుద్ధిగ నమోవాకము లర్పించుచున్నాను.

మాధుర్యరేఖాసమన్వితమైన పీఠికను ప్రసాదించిన గురుదేవులు శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారికి నా ప్రణతులు సమర్పించుచున్నాను. అజ్ఞానాంధకారావృతమగు చరిత్రాంశములకు వెలుఁగు బాటలు చూపించిన ఆచార్య శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారికి సర్వదా కృతజ్ఞుడను. అంతేగాక అంతశ్శుద్ధి వెలయనమూల్యాభిప్రాయము లొసంగిన పెద్దలకు నే నెంతయు విధేయుఁడను. ఈ గ్రంథావిర్భూతికి చేదోడు వాదోడై నిలిచిన శ్రీ వాడ్రేవు శేషగిరిరావుగారికి నా నమ

స్సులు. ప్రచురణమునకు ధనసహాయము నొనర్చిన సాహిత్య కళాపోషకుఁడు చిరంజీవి పోడూరి సత్యనారాయణగారిని ప్రశంసించుచున్నాను. అక్షర సుందరముగ ముద్రణము గావించి యిచ్చిన శ్రీ చింతపల్లి నగరయ్యగారికి నా కృతజ్ఞత తెలుపుచున్నాను.

నా యీ చరిత్రాత్మక కావ్యమును చరిత్రాభిమానులు విద్యాధికారులును ఆదరించుచు, విద్యార్థులకు పఠనీయగ్రంథముగా నిర్ణయించి ప్రోత్సహింపఁ బ్రార్థించుచున్నాను.

ఇట్లు,
గ్రంథకర్త.



# OPINION.

To present all the singularly variegated and veritable threads of the changing components of the history of India, particularly "The dark pages of the sanguinary story of the madie-val kingdoms of Daccan, whether a Hindu or Mahammadan." and at the same time to keep the unifying elements before the eyes of the reader is an up-hill task; a task that tasks the utmost talents of a writer. I feel glad to say that Sri T. Rama Rao has thoroughly succeeded in producing a handy and upto-date volume "The Empire of Vijayanagar" which is throughout characterised by an admirably remarkable ease and explicitly felicitous narration couched in litrany warmth of fragrance and glow blended with historical analysis and selection and presentation of facts. Singular brevity and pellucid clarity of expression and presentation of the roles of human story in simple direct and lucid language appear to have been the paramount aim of the author.

I feel glad again to say that he has omitted all irksome,cumbrous and controversial things which are apt to perplex a novice and he has generally stuck to the essentials; such as the glorious record of the military achieve-

ments of Krishnadevaraya, the character of the loyal and talented minister Appaji, 'The Andhra Richehiu' the florid magnificance of the flowery sculptured art patronised by the Vijayanagara court, the splendid grandeur and unparallel magnificance of the imperial city with its teeming and industrious population in the full plenitude of prosperity, the pleasing and rosy picture of the Vijayanagara society with its cleopatras, the eternal courtesans enjoying the special fovour of the king, its peaceful agricultural occupations, well-organised merchants and craft guilds and the singular triumph of Vishnavism, the admirable religious tolerance of Vijayanagara kings which may be regarded as an admirable sentiment of reminiscent of the Asokan sperit, the glorified production of literary works by literary luminaries of the distinguished merit of the " Telugu Augustan age", the strikingly pointed but brief Description of the monstrously savage massacres and terribly sickening horrors of the southern Indian waterloo, if not the climacteric the grand climacteric of the Vijayanagara empire and the victorious vandalism converting the imperial city into " A virtually vast open air museum of Hindn monuments" all these things have been presented with great skill and rare Judgement, fine definiteness and

correctness and superb arrangement and with the consummate instinct of full blooded and comprehensive brevity. So this book is not only useful as a Text-Book to all those students of South Indian history but of immense value to the general reader.

Atreyapuram
28—12—1956

S. V. Narasimha Rao,
B. A., B. Ed.,
President
Gowthamee Kala Parishat.



# విషయానుక్రమణిక



* ముఖచిత్రము *

శ్రీ విరూపాక్ష దేవాలయము.



## బు క్క రా య లు.

హరిహరరాయల మరణానంతరము బుక్కరాయలు రాజ్యాభిషిక్తుడాయెను. ఇతడు గుత్తిని ఏలుచు హరిహరునకు సంయుక్తపాలకుడుగ నుండెను. ఇరువది సంవత్సరములు అవిచ్ఛిన్నముగ రాజ్యముచేసెను. విదేశరాజ్యాంగ వ్యవహారముల నతిసమర్థతతో నడుపుచుండెను. చైనాకు రాయబారులను పంపెను. ఇతనికాలమునాటికే రాష్ట్రాధిపతుల పరిపాలన మొక ఉన్నత స్థాయికి వచ్చినది.

బుక్కరాయలకు బహమనీ సుల్తానులు ప్రక్కలోని బల్లెములవలె నుండిరి. అందు ముఖ్యముగ మొదటిమహమ్మదు, ముజాహిదుల తోడియుద్ధములు మిక్కుల ఆపత్కరములయ్యెను. అపుడు వరంగలునందలి వినాయకదేవుని సాయమాతనికి లభించినది. బుక్కరాయలు కోరినను సుల్తాను ఫిరోజ్ షాతుగ్లకు సేనాసహాయము చేయుటమాని, ఉదాసీనత వహించెను. ఈ అదను చూచికొని మొదటి మహమ్మదు హిందూరాజ్యముపై దాడివెడలెను. స్త్రీ బాల పురుష వివక్షతలేకుండ నందరిని సంహరించి యథేచ్ఛగా విహరించెను. ఆదోనిముట్టడింప బడినది. విజయనగరముకూడ మహాసాధికము దండయాత్రకువశమయ్యెను.

బంకపూరు సముద్రతీరమునకు, హిందువుల రాజధానికి నడుమగలదు. దానినిస్వాధీనము గావించుకొనుటకు ముజాహిద్ షా యుద్ధమునకు సిద్ధపడెను. రాయచూరు - అంతర్వేది పూర్వము నుండియు తమదేనని విజయనగర ప్రభువులు వాదిం

చిరి. ఆకారణముచే చివరకు రెండుపక్షములకు పోరుతప్పదయ్యె. ముజాహిద్‌షా విజయనగరముపైపడెను. వెలుపలి ప్రాకారపు గోడలలోనికి ప్రవేశించెను. అందు బుక్కరాయలు శత్రువుల పై దండు నడుపుచు అసువుల విడచెను. అతని సోదరుడగు మారప్ప ముట్టడిదారులను వెనుకకు ఉపాయమున పారద్రోలెను. ఆదోని ముట్టడి నిష్ఫలమాయెను. ముజాహిద్‌షా పలాయనమైన పిదప హిందూరాజ్యము రెండు దశాబ్దములు శాంత వాతావరణసుఖ మనుభవించినది. రెండవ మహమ్మదు గాజీ హిందూ మహమ్మదీయుల శాశ్వత ద్వేషములను తొలగించుటకు స్వాగతమిచ్చెను.

రెండవ కంపనుడు బుక్కరాయల కుమారుడు. ఇతడు తన తండ్రి రాజ్యములోని దక్షిణ భాగమునకు రాజప్రతినిధిగా నుండి పాలించెను. శంభువరాయలపై దాడి సలిపి విజయము సంపాదించెను.

పూర్వము తిరుమనాపల్లి, మధుర దేశములను ముస్లిము గవర్నరులు పాలించిరి. తిరిగి ఆ ప్రదేశములను దమవశము జేసికొన ఢిల్లీసుల్తానులు యత్నించుచుండిరి. ఇది గనిపెట్టి కంపభూపతి ఆమహమ్మదీయులను దక్షిణదేశపు సరిహద్దుల వీడి పారిపోవునట్లు జేసెను. ఆ సమయమున నాతని కొక దివ్య స్వప్నము వచ్చినది. అందు పాండ్యరాజ్యలక్ష్మి సాక్షాత్కరించి ఇట్లు వచించెనట.

"వీరకంపభూపతీ! కలుకు తురుకలదాడులు మితిమీరి పోవుచున్నవి. నన్నీ దీనస్థితినుండి పరిరక్షింప నీవే సమర్థుడవు.

ఇదిగో! ఇది పాండ్య రాజ్యమును శాసింపగల అమోఘఖడ్గము. అగస్త్యముని ప్రసాదితము. దీనిని కరమున బూనుటకు పాండ్య భూమీశ్వరులు సమర్థులుగారు. లెమ్ము. వేగలెమ్ము!"

పై చరిత్రకు గుమార కంపనునిరాణియగు గంగాదేవి మధురావిజయ సంస్కృత కావ్యమే యాధారము.

యుద్ధ విజయములందు గంప భూపతికి తోడ్పడిన మిత్రులిరువురు గలరు. వారిలో నొకడు గోపనార్యుడు. సాటి లేని వీరాగ్రేసరుడు. సుప్రసిద్ధ బ్రాహ్మణ సేనానాయకుడు. జింజిరాష్ట్రమునకు రాజప్రతినిధియై యుండెను. ఇతడు శ్రీరంగమునకు సమీపముననున్న సమయవరము చెంత మహమ్మదీయుల నోడించెను.

క్రీ. శ. 1370 లో శ్రీరంగ మధుర దేవాలయములందు పూజాపురస్కారములు నుతుల బూర్వపు టౌన్నత్యమునకు తేబడినవి. ఈ విధముగ పరాక్రమైకసాధితమై విజయపరంపరాలబ్ధమై దక్షిణాపథమంతయు బుక్కరాయల పరిపాలనమునకు వచ్చినది. హిందూరాజులలో నెల్ల మేటియగుటచేతను, హిందూమతమునకు ప్రాణాధారములగు దేవాలయములను పరులనుండి రక్షించుటచేతను బుక్కరాయాధిపుడు సురత్రాణ బిరుదాంకితుడై విశేషకీర్తి నార్జించెను.

సాళువమంగుడు కంపభూపతికి మిత్రవర్గములోని రెండవ సేనాధిపతి. ఇతనికి శ్రీరంగస్థాపనాచార్యుడను బిరుదు కలదు. సాళువవంశస్థాపకుడగు నరసింహరాయలకు పూర్వీకుడితడు.

బుక్క రాయలు రాజ్యమును కొన్నివిభాగములుగ పాలించుచుండెను. ఆ రాజ్యభాగములను రాజవంశీయులు , అమితాదరాభిమానములు జూఱగొన్న సేనానాయ గాని ఏలుచుండిరి. నెల్లూరు కడపజిల్లాలు ఉదయగిరి జ్యమనియు, బళ్ళారి అనంతపురము మైసూరులోని ఉత్తర ము పెనుగొండ రాజ్యమనియు. మైసూరులోని కొన్ని ములు సేలముదక్షిణఆర్కాటుజిల్లాలు కలసి ములవాయి జ్యమనియు, బనవాసి చంద్రగుత్తి గోవా ప్రదేశములు గ, లేక మలేహరాజ్య మనియు, బరకూరు - మంగళూరు జ్యమని పిలువబడు తుళురాజ్యమును, రాజ గంభీర రాజ్య ు నందు ముఖ్యములు.

గంగాదేవి కావ్యరచనానుసారము బుక్కరాయలు వుమొక్క అవతారమనియు, గొప్ప విజేత యని ప కీర్తింపబడుచుండెను.

రెండవహరిహరరాయలు.

ఇతడు బుక్కరాయల ద్వితీయ పుత్రుడు. ఇతడు తండ్రితరువాత సింహాసనమునకు వచ్చెను. ఇతనికి "మహా ధిరాజ" యను బిరుదుకలదు. శత్రురాజులదండయాత్రల ను, సామంతభూపతుల తిరుగుబాటుల మూలమునను ు మిక్కుల సంకటపడెను. ఈకారణమున దూరబంధువుల ంచి వారిస్థానములలో తనకుమారులనే రాష్ట్ర ప్రతి నిధు నియమించెను. అందు మొదటి దేవరాయలు ఉదయగిరి వుగ చేయబడెను.

తుంచిర చోళ పాండ్య రాజ్యములతోబాటు కొంకణ దేశముకూడ తిరుగుబాటు చేసెను. రాయలకుమారులలో విరూపాక్షుడను వాడొకడుకలడు. అతడు తమిళరాష్ట్రములపై దండెత్తి వానినణచి వానిపై రాజ్యప్రతినిధిగనుండి పాలించెను. క్రీ. శ. 1385 లో నీతడు సింహళమువఱకును దండయాత్ర సాగించెను. గోవానుండి మహమ్మదీయుల దఱిమి వేయుట యీతనిపాలనములో ముఖ్యఘట్టము. బహమనీసుల్తానులతో నీతనికి రెండుమారులు యుద్ధములు తటస్థించినవి. కాని వానిఫలితములు రెండుపక్షములకును లాభకారులు కాలేదు. తుదకు ఎవరిహద్దులను వారే సంరక్షించుకొనునట్లు ఒడంబడిరి. ఈ యుద్ధముల మూలముగా దక్షిణదేశమందు విశేషభాగము క్షామము సంభవించి ప్రజల నెక్కువగా బాధించెను.

రెండవహరిహరరాయలు శైవమతావలంబి. అయినను పరమత సహనముగలవాడు గావున సాయనాచార్యుడను వైష్ణవపుంగవుని తనముఖ్యమంత్రిగా నుంచుకొనెను. సంస్కృత భాషనేగాక కన్నడమునుకూడ ప్రోత్సహించి పోషించెను. అందుచే నీతనికి కర్ణాటక విద్యావిలాసుడను బిరుదు కలిగెను.

ఇతనికి ముగ్వురు తనయులుండిరి. ఇతనితరువాత వారు ముగ్వురును సింహాసనముకొఱకు కలహించుకొనిరి. ఎవరికివారే "మహారాయ" బిరుదముల ధరించిరి. కొన్నాళ్ళకు వారిలో నొకడగు రెండవ విరూపాక్షుడు మరణించెను. సవతిసోదరుడగు రెండవబుక్కరాయలతో మొదటిదేవరాయలు ఎదిరించి ఓడించెను.

## మొదటి దేవరాయలు.

ఇతడు 1406 సంవత్సరము నవంబరు అయిదవ తేదీన పట్టాభిషిక్తుడయ్యెను. అంతఃకలహములుగాని అంతఃపురకలహములుకాని లేక జనులెల్లరు నాతనియెడ భక్తివిశ్వాసములతో మెలగెడివారు. 1397 వ సం॥ మొదలు 1422 వ సం॥ వరకును సుల్తానుఫిరోజి బహమనీతో జరుగుచుండిన యుద్ధములో నీతడు అనవసర కలహమునకు తలపడి చివరకు తనకుమార్తె నాతని కిచ్చి వివాహముచేసి విధేయతతో సంధి గావించుకొనవలసి వచ్చెను. తరువాత రాజకొండవెలమల సహాయము లభించగా తిరిగియుద్ధముచేసి ఫిరోజీని ఓడించి 1419 లో విజయముసంపాదించుకొనెను. ఈ దేవరాయలకు అన్నియుద్ధములందును తన కుమారుడగు వీరవిజయరాయలును మంత్రియగు లక్ష్మీధరుడును తోడ్పడుచుండిరి.

ఇతడు విజయనగరమును విస్తరింపజేసి చుట్టును కోటగోడలను దిట్టపఱచి బురుజులను గట్టిగ నిర్మించి నట్లు నన్నీజ్ గారు వ్రాసియున్నారు. కాని సీవెల్‌గారు దేవరాయలు తుంగభద్రలో పెద్దయానకట్టనుకట్టించి అందుండి పట్టణములోనికి 15 మైళ్ళదూరము కాలువగుండా నీటిని పాఱించి వ్యవసాయాభివృద్ధికి ఎక్కువగ తోడ్పడినట్లు వ్రాసియున్నారు. అదియే యథార్థమైనచో ఆకాలమునందు 15 మైళ్ళదూరము ఱాళ్ళను తొలిచి కాలువపాఱించుట, ఆనకట్టను నిర్మించుటలనగా అలతికార్యములుగావు.

## వీరవిజయరాయలు.

ఇతనికి వీరబుక్కరాయలను నామాంతరముకూడ గలదు. ఈతడు విశేషముగ సైన్యాభివృద్ధిని, మతోద్ధరణమును, సాహిత్యపోషణమును కావించినట్లు తెలియుచున్నది. ఇది చూచి ఓర్వలేక బహమనీసుల్తానగు అహమదుషా విజయనగరముపైదండెత్తెను. తుంగభద్రాతీరమున యుద్ధముచేసి ఇరువది వేలమంది హిందువుల నన్యాయముగా దారుణముగా నాశనము గావించెను. అంతతోబోక మూడురోజులాగి తాను గావించిన ఆరక్తపాత ఘనకార్యమునకు సంతోషము పట్టలేక ఆప్రదేశమునందొక గొప్ప మహమ్మదీయోత్సవమును చేసెను. పెక్కుదేవళములు పడగొట్టించి విగ్రహముల చితుకగొట్టించి బ్రాహ్మణుల కళాశాలలను నాశనము గావించెను. వీరవిజయరాయలయొద్ద పెద్దమొత్తములనుయుద్ధపుఖర్చులక్రింద పుచ్చుకొనుటయేగాక పెక్కురు ప్రజలను పండితులను బందీలనుగా తీసికొనిపోయెను.

## రెండవ దేవరాయలు.

ఇతడు రాజ్యమునకు వచ్చినతర్వాత బహమనీసుల్తాను విజయనగరమును ముట్టడించి వరంగలుమీదకుపోయి రెంటిని ధ్వంసముచేయసాగెను. అప్పుడు (1424లో) దేవరాయలాతని నెదిరించి పారద్రోలెను. ఇతనికి "గజభీతికార" అను బిరుదు కలదు.

ఈయన పరిపాలనలో విజయనగర సామ్రాజ్యము పేరు ప్రఖ్యాతులతో విరాజిల్లుచుండెను. మహమ్మదీయులతోడి

యుద్ధానంతరము ఈతడు సైన్యాభివృద్ధిగావించుట కొకకీలకము గ్రహించి ఆచరణమునకు తెచ్చెను. తన రాజధానీనగరము నందు విశేషముగా మహమ్మదీయ సైన్యములను నెలకొల్పెను. వారిమతవిషయములకు హిందువు లేవిధముగను విఘాతములు కలిగింపరాదని గట్టిగా శాసించెను. హైందవయోధులకు ధనుర్విద్యాశిక్షణ నిప్పించి నిపుణులగావించెను. ఆనాడచటి 20,000 యవన సైనికులు, 60,000 హైందవయోధులును, ధనుర్విద్యా కుశలులైరి. 80,000 ఆశ్వికులు సుశిక్షితులైరి. 2,00,000 పదాతులు సర్వాయుధకుశలులైరి. అందువిశేషము భల్లయుద్ధచతురులు. అతని పరిపాలనా చరమదశయందు బహమనీసుల్తానులతో యుద్ధముసంభవించినది. అందుపాపమీతని జ్యేష్ఠపుత్రుడు మృతుడయ్యెను.

రాయలమంత్రి లక్ష్మణదండనాయకుడు సింహళముపై దండయాత్రకు వెడలి జాఫ్నాను తిరిగి స్వాధీనము చేసికొనెను. దీనితొలివిజయము 1385లో విరూపాక్షునిచే జరిగినట్లు చెప్పబడుచున్నది. సింహళీయులపద్యకావ్యములందు జాఫ్నాపై దండెత్తినవారు కన్నడులని వ్రాయబడియున్నది. ఈ విషయము 17 వ శతాబ్దివాడగు వాలంటిజిన్ (Valentijin) అను డచ్చి లేఖరివలన తెలియుచున్నది. క్విలను, సింహళము, పెగూ, పులికాటు, తెనాసెరిం (Tenasserim) ప్రదేశముల ప్రభువులు రాయలకు కప్పముల చెల్లించుచుండిరి.

1420 ప్రాంతమున నికోలో డీకాంటీ (Nicolo Dei Conti) అను నొకయిటలీ యాత్రికుడు విజయనగరమును

సందర్శించెను. తాగన్నంత విన్నంత ఒక గ్రంథముగా వ్రాసెను. “విజయనగరము మిక్కిలి యెత్తైన పర్వతముల సమీపమున నిర్మింపబడినది. దీనిచుట్టుకొలత అరువది మైళ్ళుండెను. కోట గోడలు పర్వతములకు అతుకబడియుండెను. మఱియు వాని లోయలు అడుగుభాగమున గోడలచే ఆవరింపడియుండెను. ఈ నగరమునందు 90,000 సాయుధ యోధులుండిరి” ("The great city of Bizenegalia is situated near very steep mountains. The circumference of the city is sixty miles; its walls are carried up to the mountains and enclose the valleys at the foot; so that its extent is there by increased. In this city there are estimated to be ninety thousand men fit to bear arms" See 82 page in "A forgotten empire.")

అబ్దుల్‌రజాక్ అను పారసీకరాయబారి 1443లో విజయనగరమునకే తెంచెను. అచట తాదెలిసికొన్న దంతయు నొకచరిత్రగా వ్రాసెను. ఆనాటి విజయనగరాధీశుడు ఒకగొప్ప పరాక్రమాన్వితుడు. ఆతని రాజ్యము సారండిప్పునుండి కల్బర్గా వఱకును మలబారునుండి బంగాళాపర్యంతమును వ్యాపమైయుండెను. అందు 300 కోటలుండెను. రాజ్యవిస్తీర్ణము వెయ్యి పరసాంగులుండెను. పరసాంగు అనగా 31 చదరపుమైళ్ళు. రాజధానీనగరము అతివిశాలమై బహుజనాకీర్ణమై యుండెను. ఆనగరముచుట్టును సప్తప్రాకారము లుండెను. అందు వెలుపలి మూడు ప్రాకారములమధ్య సస్యశ్యామలములగు

పంటపొలములు, ఫలపుష్పసుందరవనములు, రమ్యభవనములు నుండెను. నాలుగవ ప్రాకారమాదిసప్తమప్రాకార పర్యంత మునుగల ప్రదేశమునందు విపణివీధులు, అంగళ్ళును సాంద్రముగా వెలసియుండెను. ఏడవప్రాకారమధ్యమున వర్తకు లంగళ్ళనమర్చుకొనుటకు అనువుగ గదులుగదులుగ కట్టబడియుండెను. ఆప్రదేశము అత్యున్నతమైనఅర్ధవృత్తాకార స్తంభనిర్మితములైనవి. వలయాకృత సోపానపంక్తులుగలవి. ఈ దృశ్యము విజయనగర రాజులకాలమునాటి శిల్పకళాప్రాభవమునకు చక్కనియుదాహరణము. అందలివర్తకులు బారులుతీర్చి తమ దుకాణములనమర్చుకొనువారు. ప్రతివస్తు విక్రేతలకు ప్రత్యేక సంఘభవనములును, సర్వవర్తక సంఘమునకు ఒకమహాభవనమును అందేనిర్మితములై యుండెను. భూషణవిక్రేతలు వజ్రవైడూర్యాదినవరత్నములను వెండిబంగారులను బహిరంగముగ రాసులురాసులుగ వేర్వేరబోసి అమ్ముచుండిరి. మహానవమి నాటి సుందరదృశ్యములు, సైన్యవిన్యాసములును అత్యంత దర్శనీయములై యుండెను.

దేవరాయలసభ కవులతోను పండితులతోను చిత్రకారులతోను శిల్పులతోను నిండియుండెను. విశేష విఖ్యాతిపడసిన తెనుగుకవియగు శ్రీనాథుడు విజయనగరము సందర్శించెను. డిండిమవంశమునకు జెందిన అచటి యాస్థానకవితో వాదించి యోడించి సార్వభౌమబిరుదమువహించి రాయలచే కనకాభిషేకాది ఘనసన్మానములొందెను. ఈ దేవరాయలు

వీర శైవమతాభిమాని. వీరశైవరచయితయగు చమరసుడు ప్రభులింగలీలయను కావ్యము నిక్కాలముననే వెలయించెను. ఈ కావ్యము గంభీరపదగుంభనముతోడను, అనర్గళధారా ప్రవాహమగు శైలితోడను, వీరరసప్రధాన విషయములతోడను ఒప్పియుండెను. అందాకాలమునాటి హైందవ సదాచారములు వర్ణింపబడియున్నవి. రాయలవంశీయులు వర్ణాశ్రమ ధర్మములకు సంరక్షకులుగను, మహోదారసులుగాను కీర్తింపబడుచుండిరి. పండుగలు దేవాలయపూజా పురస్కారములు విస్తారముగా జరుగుచుండెడివి. సతీసహగమనముకూడా ఆచారములో నుండెడిది. వరశుల్కములుగొను నాచారము నిరాకరింపబడుచుండెను. పై సాంప్రదాయములన్నియు పడయవీడు రాష్ట్రములోని కర్ణాటక, తమిళ, ఆంధ్ర, లాట దేశములలోని బ్రాహ్మణులయందెక్కుడుగ నాచరణలో నుండినట్లు తెలియుచున్నది.

విజయనగరరాయలకొఱకును, ఒరిస్సాయందలి గుజరాతీయులకొఱకును, కొండవీటి రెడ్డినాయకులకొఱకును ఒక గొప్ప వైశ్యశిఖామణి అమూల్యవస్తువాహనాది వర్తకపుసరకులను వివిధదేశములనుండి దిగుమతిచేయుచుండెడివాడు. మఱియు నీతడు పంజాబునుండి కర్పూరపుమొక్కలను, సింహళము నుండి ఏనుగుగున్నలను, ఆర్మోజానుండి కస్తూరిని, చీనానుండి పట్టవస్త్రములను తెప్పించుచుండెడివాడు. * ఈదేవరాయలు శైవమతమునేగాక మిగిలిన హైందవమతములన్నింటిని సహాన

* శ్రీనాథుని హరవిలాసము.

భావముతో పోషించుచుండువాడు. ఇతడు తన రాజధానిలో మహమ్మదీయులకొఱకొక మసీదునుకూడ కట్టించెను. రాజభవన సామీప్యమున ఒక జైన దేవాలయమునుకూడ నిర్మించెను.

## మల్లికార్జునుడు.

ఇతనికి ఇమ్మడిప్రౌఢదేవరాయలు. మూడవదేవరాయలునను నామాంతరములుండెడివి. ఇతడు మూడవవిరూపాక్షునిచే రాజ్యభోగములనుండి తప్పింపబడెను. ఈ మొదటివిప్లవము 1466 లో జరిగినది. ఇందు అధికముగా రక్తపాతము జరుగలేదు. కాని 1485 లో సాళువనరసింహరాయలు మల్లికార్జునుని, మూడవ విరూపాక్షరాయలనుకూడ జయించి తానే రాజయ్యెను.

మల్లికార్జునుడు రెండవఅల్లాయుద్దీను సేనలతోను కపిలేశ్వరగజపతిసేనలతోను యుద్ధములుచేయవలసివచ్చెను. విజయనగరప్రభువులచే వినుకొండ ఆక్రమించుకొనబడిన పిమ్మట విజయనగరపు సరిహద్దులగుఱించి తగవులువచ్చినవి. బహమనీ సుల్తానులును గజపతులును కలిసి దండయాత్రలు సాగించిరి. మొదటలో శత్రువులను జయించుటచేత మల్లికార్జునునకు తురుష్కదళవిభేదనుడని ప్రసిద్ధివహించెను. కాని 1462 లో బహమనీ సైన్యము దేవరకొండనుండి వెనుకకు తఱిమివేయబడి నపుడు రెండవ దండయాత్ర జరిగినది.

అల్లాయుద్దీనుచనిపోయినతరువాత బహమనీరాజధానిలో అల్లకల్లోలములు చెలరేగినవి. ఆసమయముకనిపెట్టి కపిలేశ్వర

గజపతి తొందరలోని విజయనగరపు వెలుపలిసరిహద్దుప్రదేశము లను జయించుటకు తానేదియేత్తులు వేయుచుండెను. కంచి చుట్టునున్న దేశములజయించుటకు కపిలేశ్వరుడు సమరసన్నాహములగావించు చుండెను. మూడవ విరూపాక్షరాయలకాలమున ఓఢ్రదేశపు బెదరింపులచే కలవరములు బయలుదేరినవి. దక్షిణార్కాడు జిల్లాలోని జాంబై దేవాలయములోని యుత్సవములు నిలిపివేయబడినవి. ఓఢ్రుల ముట్టడుల వలన తిరుకోయిలూరులోని వైష్ణవదేవాలయము శిథిలావశిష్టమైనది. రాజోద్యోగులు సుంకములకొఱకు రైతుల బాధింపజొచ్చిరి. ఈదురంతములను మల్లికార్జునరాయలు అరికట్టలేకపోయెను. ఈ యరాజక సమయములో ఓఢ్రులకు కంచివశమైనది.

మహమ్మదీయులు విజయనగరమునకు గుఱ్ఱములనందీయుట లేదనుకారణమున భట్కాలునొద్ద రాయలువారిని సంహరించి పగదీర్చుకొన నాజ్ఞాపించెను. హతశేషులు గోవాకు పలాయనులైరి. గోవా బహమనీసుల్తానుల ముఖ్యమంత్రియగు మహమ్మద్ గవన్‌చే ముట్టడింపబడినది. ఆముట్టడి భూసముద్రమార్గముల రెంటను గావింపబడినది. రాయలప్రయత్నము బెల్గాము నందలి తుఱకలముట్టడిచే భంగపఱుపబడినది. ఈ దురదృష్టమునకుతోడు మహాదారుణమగు కాటకముకూడ నప్పుడే సంభవించినది. రెండేండ్లపాటు రాయలరాజ్యమునందెల్లెడల క్షామదేవత విలయ తాండవముచేసినది. ఈవఱపు దక్షిణమండలముల కంతగ వ్యాపించలేదుగాని ఆంధ్రమండలములమాత్రము విశేషముగా పీడించినది. కొండపల్లిప్రజలు మహమ్మదీయరాజ ప్రతి

నిధిపై ఎదురుతిరిగినపుడు వారు ఒరిస్సా ప్రభువు సహాయమును అర్థించిరి. అపుడు బహమనీ రాజప్రతినిధి కొండపల్లి మండలమును ఆక్రమించుకొని రాజమహేంద్రవరమును బలాత్కారముగా స్వాధీనముగావించుకొనెను. మహమ్మదీయులు కొండపల్లిలోని హైందవదేవాలయమును నేలమట్టముగావించిరి. పైగా దానిపైనొక మసీదును నిర్మించిరి. సుల్తాను తెలంగాణాను సంపాదించినతర్వాత విజయనగరము మీదకు దండయాత్ర బయలువెడలెను. ఆకాలమునందొక రాజకీయ విప్లవ మచట చెలరేగుచుండెను. అందులకు సాళువ నరసింహారాయలు ముఖ్యకారకుడు.

ప్రారంభములో సాళువనరసింహరాజు ముల్‌బాగల్ పెనుగొండలకు పాలనాధికారిగా నుండెను. ఇతడు తెలంగాణా కర్నాటకరాజ్యములకు మధ్యనున్న దేశమునకు ప్రసిద్ధనాయకుడై స్వతంత్రతను ప్రకటింప దొడగెను. శత్రువుల జయించుటకు రాజమహేంద్రవరము వరకునువచ్చెను. గజపతిరాజు నెల్లూరు రాజమహేంద్రవరముల మధ్యస్థరాజ్యమును తన వశము గావించుకొనుటకు యుక్తులు పన్నుచుండెను. ఇది కనిపెట్టి సాళువనరసింహుడు యితనిని వెనుకకు పాఱద్రోలెను. ఇతడు తనయధికారములోనికి పశ్చిమ మధ్యమ రాష్ట్రముల పెక్కింటిని తీసికొని వచ్చెను. ఈతడు చంద్రగిరియందలి తన పూర్వపు రాజప్రతినిధిపదవిలో ప్రారంభించి ఉదయగిరిని, గోదావరి వరకునున్న ఓఢ్రులసరిహద్దులను జయించెను. పెనుగొండ, కొంగూ, ధారాపురము, జింజీలనుకూడ ఇతడు తన

నశము చేసికొనెను. ఇతను చేసిన యుద్ధములన్నింటను ఆరవీటి బుక్కరాయలు, ఆతనికుమారుడు రామరాజు, తుళువఈశ్వరుడు, అతనికుమారుడు నరసనాయకుడును శక్తివంచనలేక సహాకరించిరి. వీరిలో నరసనాయకుడు కడుంగడు ప్రసిద్ధుడు.

విజయనగరమునందిప్పటికి రెండు రాజకీయవిప్లవములు జరిగినవి. మూడవవిరూపాక్షరాయలు మల్లికార్జునుని దేశము నుండి తఱిమివేసి ఆతని నాశ్రయించియున్న అనేకుల హత మార్చి రాజయ్యెను. మల్లికార్జునుడు క్రీ. శ. 1487 వఱకును సజీవుడైయుండెను. ఇతడు పుత్రపౌత్రులతోసహా ప్రాతతుందిర, చోళ, మైసూరు దేశములందు స్థానిక చమూనాయకులుగ పని చేయుచుండెడివారు. మల్లికార్జునుని మనుమడైన ప్రౌఢదేవ మహారాయలు సాళువనరసింహరాజుకు రాజ్యము కోలుపోయెను. బహుశః సంగమవంశజులలో నీతడే కడపటివాడై యుండవచ్చును.

సాళువనారసింహుడు క్రీ. శ. 1465 లో మూడవ విరూపాక్షునినుండి రాజ్యమును అన్యాయాక్రమణము గావించెను. ఇతడు తన దానశాసనములయందు "రాజరాయమహారాజు" అను బిరుదమును చేర్చుకొనెను. క్రీ. శ. 1486 తరువాత మూడవవిరూపాక్షుని నామరూపము లంతరించినవి. రాజపరమేశ్వర ప్రౌఢప్రతాపనారసింహరాయలు విజయనగరమునందు వజ్రసింహాసనస్థుడై వసుంధరబాలించెను. రాష్ట్రాధిపతి మహామండలేశ్వరుడని గౌరవింప సాళువనరసింహుడు మహారాయలుగా ప్రసిద్ధుడయ్యెను.



# సంగమ వంశవృక్షము.

సంగముడు





















# సాళువ వంశము.

సంగమ వంశముతరువాత సాళువవంశపు రాజులు పరిపాలించిరి. సాళువమనగా డేగయని యర్థము. ఈ వంశమునకు మంగుడు మూలపురుషుడు. ఇతడు సాళువనరసింహుని ముత్తాత. ఇతనికి పరపక్ష సాళువుడను బిరుదముకలదు. పశ్చిమ కర్ణాటకమును పాలించిన స్థానిక చమూనాయకుల పూర్వ వంశీయులే యీ సాళ్వవంశమువారు.

## మొదటి నరసింహరాయలు.

ఇతడు మహమ్మదీయులను తన సామ్రాజ్యమునుండి పాఱద్రోలుటయేగాక తనరాజ్యాధికారమును ఉదయగిరికి ఈశాన్యపు సరిహద్దువరకును, కృష్ణానదీతీరమునఱకును వ్యాపింపజేసెను. వారణాసియందితడు రాజ్యాభిషిక్తుడయ్యెను. తానుకావించిన రాజ్యదురాక్రమణమును సరిదిద్దుకొనుటకును సదాచార సమ్మతిని పడయుటకును అచటకుపోయెను. అతడు దేవాలయములకు గొప్పగొప్ప దానములుచేసెను. బీదరునందలి ఖాసీంబరీద్ ఈతనిసహాయముతో బీజపూరుపై దండెత్తి దానిని పాలించు అదిల్షా నోడించెను. ఈకాలమునందే బహమనీ రాజ్య మైదుభాగములైనది. హిందువులు తమరాజ్యమును ముద్గలు, రాయచూరులపర్యంతము విస్తరింపజేసిరి. హేమరాజను నామాంతరముగల నరసనాయకు డీసమరవిజృంభణము నందు ముఖ్యసేనాధిపత్యము వహించెను. కాని మఱల కొలది వత్సరములలోనే అదిల్షా రాయచూరుపై తిరుగబడి దండయా

త్రగావించెను. హేమరాజును జయించి కెంచుకోటలను స్వాధీనము చేసికొనెను. ఆయుద్ధములో రాయల చిన్నకుమారుడు తీవ్రముగా గాయపడెను.

ఈతడు సింహాసనమునకు రాకపూర్వము ప్రజలుసార్వభౌమునాజ్ఞలకు విధేయులై యుండెడివారుకారు. ఇతని కాలమున శత్రురాజుల దాడు లరికట్టబడెను. రాజ్యమందు అచ్చటచ్చట తలనెత్తు నల్లరులను చాలవరకీతడు అణచుచుండెను. ఈపని సామ్రాజ్య ప్రయోజనకారిగా పరిణమించెను. అంతేగాక తల్లికోట యుద్ధమును మఱియొక యెనుబదియేండ్లు ముందుకు త్రోసివేసెను.

ఇతనికి సార్వభౌముడనియు, ధరణీవరాహుడనియు, భుజబలదేవుడనియు, మహారాయలనియు బిరుదము లుండెడివి. దుష్టరాజులనెడు సముద్రమునుండి భూమిని పైకెత్తుటచే ధరణీవరాహుడని బిరుదువచ్చెను. ఇతడు గొప్ప కవిపోషణచేసి సాహిత్యపోషకుడని పేరొందెను. రాజనాథడిండిముడు తొలుత నీ నరసరాయల యొద్దనే ఆస్థానకవిగా నుండెను. ఈతడు సాళువాభ్యుదయమను కావ్యమును రచించెను. రామాభ్యుదయకావ్యమును నారసింహరాయలే రచించెనని తెలియుచున్నది. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవికూడనీతని యాస్థానముననే ఉండెను. ఇతని "నవరత్నములు-సప్తాంగ పద్ధతి" అనుకావ భాగములో రాయల స్వభావాదులు వ్యక్తములగుచున్నవి. వాణి నారాణియని లోకమునకు చాటిన కవివతంసుడీతడేగదా!

## ఇమ్మడి నరసింహారాయలు.

1491 లో సాళువ నరసింహారాయలు భౌతిక దేహము చాలించెను. తుళువేశ్వరుని కుమారుడగు నరసనాయకుని రక్షణములో ఆతనియిరువురు పుత్రులునుంచబడిరి. మొదటివాడగు తిమ్మరాయలు రాజయ్యెను. ఇతడు నరసనాయకుని ప్రతిపక్షీయగు తిమ్మరుసుచే హత్యగావింపబడెను. తరువాత ఇమ్మడి నరసింహారాయలు సింహాసన మధిష్టించెను. ఈతనికి ధర్మరాయలను నామాంతరముకూడ నుండెను. ఇతడు నరసనాయకుని చేతిలో కీలుబొమ్మవలెనుండి నామమాత్రపు సార్వభౌమపదవి నహించెను. నరసింహారాయలు తిమ్మరుసుపై అభిమానము చూపుట మానలేదని నరసనాయకుడు తనసైన్యముతో పెనుగొండనుండి విజయనగరముపై దండెత్తెను. 1492 లో ఇమ్మడి నరసింహారాయలు తిమ్మరుసును త్యజింపవలసివచ్చెను. ఇట్లు నరసనాయకుడు దురాక్రమణను కావించెను. తానే సాళువ బిరుదములతో రాజ్యపాలనము చేయుచుండెను.

1492–93 లో ఖాసింబరీదు (Quasim Barid) ప్రోత్సాహముచే నరసనాయకుడు రాయచూరు-అంతర్వేదిపై సేనల పంపెను. యూసఫు ఆదిల్ ఖాను వారితో పోరాడి ఓడెను.సంధిచేసికొనునిమిత్తము నరసనాయకుని ఆహ్వానించెను. అచట వారినెదిరించి, డెబ్బదిమందిని చంపెను. చివరకు ఆదిల్ ఖాను గెలుపొందెను. కాని 1502 వఱకు రాయచూరు- అంతర్వేది(Raichur ab) విజయనగర రాజ్యములోనే ఉండెను.

తిరుచునాపల్లి. తంజావూరుల పాలకుడగు కోనేటిరాజు చేయు అల్లరులను అణచివైచెను. మధురలోని మానభూషుని తనవశము చేసికొనెను. శ్రీరంగపట్టణముపై దండెత్తి, అచటి నంజరాజును ఓడించెను. 1497 లో గోకర్ణముపై దాడిసలిపి గెలిచెను. ప్రతాపరుద్రగజపతిప్రభువు దండయాత్రను అతి సమర్థతతో నిలుపుచేసెను.

నరసనాయకుడు చాలసమర్థుడును, బలిష్ఠుడునైన పాలకుడు. ఇటలీదేశ యాత్రికుడగు లుడొవికొడివర్తెమ (Ludo Vico De Varthema) ఇతని రాజధానీనగర ఘనతను వర్ణించెను. అతని వ్రాతలబట్టి ఆనగరము చుట్టుకొలత ఏడు మైళ్లు కలదిగను, మూడుప్రాకారములు కలదిగను, 40,000 ఆశ్వికయోధులును, 400 గజములు నుండినట్లు తెలియును. సాళువనరసింహరాయల పిదప సామ్రాజ్యవిస్తృతికి పాటు బడినవాడీతడే. ప్రతిభాసంపన్నుడైన పుత్రుడు కృష్ణదేవ రాయని అఖండవిజయ పరంపరలకు ఈనరసనాయకుడు చక్కని పునాదులువేసెను.

## 2. సాళువవంశవృక్షము.

సాళువనరసింహరాయలు.

1486-91



# తుళువ వంశము.

నరసనాయకుడు 1503 లో స్వర్గస్థుడయ్యెను. తోడనే ఇమ్మడి నరసింహరాయలు సింహాసనమధిష్ఠించి అనతికాలము ననే గతించెను. ఇమ్మడినరసింహరాయల ఇరువురుకుమారుల స్వామ్యాధికారములను త్రోసిరాజని తొంటి నరసనాయకుని జ్యేష్ఠపుత్రుడు వీరనరసింహరాయలుసింహాసనమాక్రమించెను.

## వీరనరసింహరాయలు.

ఇతడు అన్యాయముగా పీఠమలంకరించుట ప్రజలు అసంతృప్తిని ప్రకటించిరి. ఇతనికాలమంతయు సైన్యాధిపతుల మీాదను, సామంతరాజులమీాదను సమరములు సలుపుటతో డనే సరిపోయినది. తనరాజ్యమున చెలరేగిన తిరుగుబాట్లను అణచుటకు పదిలక్షల వరహాలను వెచ్చింపవలసి వచ్చెను. తన యనంతరము వచ్చిన సార్వభౌమునకు ఈతడు శూన్య కోష్ఠములను, హైన్యరాష్ట్రములను మాత్రమొప్పగించెను.

ఇతడు తనయనంతరమున ఎనిమిదేండ్లు వయస్సుగల తన పుత్రునకు సింహాపీఠమును కూర్చవలెనని తలంచెను. అందు లకు ఆతని సవతిసోదరుడగు కృష్ణదేవరాయలు ప్రతిబంధక మాయెను. తాను చనిపోవుటకుముందు సాళువ తిమ్మనను రప్పించి, కృష్ణదేవరాయల గ్రుడ్లుపీకించి చూపనాజ్ఞాపించెను. ప్రధానామాత్యుడగు సాళువతిమ్మన నరసనాయకునియందు,వీర నరసింహరాయలయందు, కృష్ణదేవరాయలయందునుకూడ మిగుల రాజభక్తితో మెలగు న్యాయమూర్తి. అందువలన

ఆదీర్ఘదర్శి కృష్ణదేవరాయలను కాపాడెను. చావనున్న రాజునకు మేకకన్నులను తెప్పించిచూపెను. ఈ విధముగా తిమ్మరుసు కాబోవు సార్వభౌముని ప్రాణముల సంరక్షించి తనజీవితమును ధన్యము చేసుకొనెను. ఇట్టివారే పరార్థప్రాపకులు గదా.

## శ్రీకృష్ణదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయలు 1509 లో సార్వభౌమ పీఠమలంకరించెను.

ఉదయగిరి, రాయచూరు, ముద్గలుదుర్గములు స్వాధీనపఱచుకొనుటయును, ముందుకుత్రోసికొని వచ్చుచున్న గజపతులను, మహామదీయులను వెనుకకు నెట్టివేయుటయు తన ప్రథమ కర్తవ్యాంశములుగా ఈకొత్తప్రభువు నిశ్చయించుకొనెను. పోర్చుగీసువారి గోవా పాలనాధికారి అల్బూకర్కు రాయలు కాలికట్టును భూమార్గమున ముట్టడించిన చోతాను సముద్రమార్గమున ముట్టడించిసాయము జేయుదుననియు, అంతియేగాక రాయలకు కావలసినన్ని ఉత్తమాశ్వములనిచ్చి అతని మహమ్మదీయ శత్రువుల నందఱ వెదిరించుటలో తోడ్పడుదుననియు, ఇట్టిసహాయము తనకుతక్కతక్కిన ఏదక్కను రాజునకును చేయననియు మాటనిచ్చెను. 1510 లో గోవాను అల్బూకర్కు వశపఱచుకొన్న పిమ్మట ఇదేవాక్యమును పునరుద్ఘాటించెను. అందులకు ప్రతిఫలముగా భట్కాలునందు పోర్చుగీసువారి రక్షణార్థము కోటనొకటి నిర్మించుకొనుటకు మాత్రము తనకు ఆజ్ఞనిప్పించవలసినదిగా

పదేపదే ప్రార్థించెను. బీజపూరుసుల్తానైన అదిల్‌షాతో తనకు గల సంబంధములనంత శీఘ్రకాలములో త్రెంచుకొనగల్గునంతగా తానింకను దృఢపడియుండలేదని చెప్పి యల్బూకర్కు ప్రార్థన నంగీకరించలేదు. మహమ్మదీయులు గోవాను మఱల తీసికొన ప్రయత్నించిరి. కాని కృతకృత్యులు గాలేకపోయిరి. 1512లో రెండవతూరిగూడ వారు పరాజితులైనపిమ్మట భట్కాలులో పోర్చుగీసువారు కోటనిర్మించుకొనుటకు రాయలనుమతినిచ్చెను. 1510కి పూర్వము గోవాయింకను మహమ్మదీయుల చేతిలోనుండుటచే నది ఇంకను కోటలతో కట్టుదిట్టమై బలపడులోపున దానింబట్టుకొనుటకు రాయలు తనంతటతానే యొకపథకమును వేసియుండ నోపును. ఇంతలో తిమ్మరాజు తనకు కొంతసైన్యసహాయము చేసినచో తానాకార్యమును చక్కపఱుపగలనని వాగ్దానమిచ్చుటచే వేచియుండెను. రాయలు యుక్తిపన్ని పోర్చుగీసువారినుండి అశ్వములను, శిల్పకళానిపుణులను, శతఘ్నీకాచోదకులను తానే దిగుమతి గావించుకొనుటను గుత్తకు గొనెను.

తొలుదొల్త తన జైత్రయాత్ర శివసముద్రము, శ్రీరంగపట్టణములదెసకు నడిపించెను. అటనుండి 1512–13 లలో నుదయగిరిమీదకు నడిపి తిఱిగిముట్టడించెను. రెండవదండయాత్రను తూర్పుతీరమునకు బట్టించి యద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకోనమున్నగు బలిష్ఠప్రదేశములను 1514లో వశపఱచుకొనెను. 1515 లో గొప్పకోటయగు కొండవీటిని

ముట్టడించెను. పెక్కుదినములవఱకు అది పట్టువడలేదు. తద్దుర్గ రక్షకులగు కేశవపాత్రుని, ప్రతాపగజపతి కుమారుడగు యువరాజు వీరభద్రుని పట్టుకొని బంధితులుగా తీసికొనిపోయెను. 1516_17 లలో రాయలు మఱొక్కమారు ప్రాచ్యతీరమునకు దండువెడలెను. విజయవాడలో విడిసి కొండపల్లెను ముట్టడించి స్వాధీనముగావించుకొని యటనుండి ఒరిస్సా రాజ్యములోనకు వెళ్ళుటకు ఉద్యుక్తుడయ్యెను. మధ్యేమార్గమునకుతుబ్ షాహీ రాజ్యమునుచొచ్చి ఇప్పటి రాయచూరు, నల్లగొండ, వరంగలు జిల్లాలను అనగా కనకగిరి, ఖమ్మమ్మెట్టు, నల్లగొండ, జల్లిపల్లె మొదలగు అనేకదుర్గముల ముట్టడించి జయించెను. అచటినుండి గోదావరిని దాటినడచి విశాఖపట్టణపు జిల్లాలోని సింహాచలమును పొట్నూరును జయించెను. తత్పాలకుడు ప్రతాపరుద్రుడు పాఱిపోయెను. ఆపిమ్మట కటకముకూడ ధ్వంసముగావింపబడెను. గజపతిని జయించుటతో నాదైత్రయాత్ర పూర్తిగావింపబడినది. కృష్ణానది యుత్తరతీరము వఱకును తెలుగ గజపతి కోసంగబడినది. గజపతి తనతనయ జగన్మోహినిని రాయలకిచ్చి వివాహము కావించెను.

మూడు సంవత్సరముల శాంతియనంతరమున రాయలు బీజపూరుపైయుద్ధము ప్రకటించెను. అపారసేనావార సమేతుడై బయలువెడలి రాయచూరుముట్టడించి జయించి తీసికొనెను. పిదప కల్బర్గాపైకెత్తిపోయి ఘోరముగాపోరి యుభయ తరంగిణీ మధ్యప్రదేశమగు రాయచూరు మండలమునంతను

1520 లో విజయనగర సామ్రాజ్యమున చేర్చివేసెను. బహమనీసుల్తానును జయించి పదభ్రష్టునిగావించి కొన్నాళ్ళకాతనినే యథాస్థానమున నిల్పినట్లు శాసనములవలన తెలియుచున్నది. 1525 లో రాయచూరును తిరిగి స్వాధీనము చేసికొనుటకై ఆదిల్షా చేసినయత్నము భంగమొనర్చెను. బెల్గాము గెల్చుటకై పోర్చుగీసువారి సాయముతో దండయాత్రకు బయలుదేరబోవు సమయమున ఆకస్మికముగా కృష్ణదేవరాయలు స్వర్గస్థుడయ్యెను.

శ్రీకృష్ణదేవరాయలు యూసఫ్ ఆదిల్ఖానుతో పోరాడి ఓడించెను. కొవిలకొండ దుర్గమితనికి వశమాయెను. రాయచూరుముట్టడి యనంతరము రాయలు గుల్బర్గాపై దాడివెడలి, రెండవమహమ్మదు మంత్రియగు అమీరుబరీదు నోడించెను. తరువాత బీదరుపై దండెత్తి, స్వాధీనముచేసికొనెను. అందువలన నితనికి యవనరాజ్యస్థాపకుడని బిరుదు కలిగినది. ఉమ్మత్తూరు సేనాధిపతియగు గంగరాయలు చేయు కుట్రలనణచి, ఆక్రొత్తరాష్ట్రమునకు సాళువగోవిందరాయలు మొదటి గవర్నరుగారు నియమించెను. దానికి శ్రీరంగపట్టణము రాజధానియయ్యెను. దానిస్థానిక పరిపాలకులలో కంపగౌడ సేనాధిపతి యొకడైయుండెను. ఓఢ్రప్రభువుగావించు రాజ్యదురాక్రమణల నణచివైచెను. 1513 లో ఉదయగిరికోటను జయించెను. పిదప కృష్ణదేవరాయలు తిరుమల, చిన్నాదేవేరులతో కలిసి తిరుపతి వెంకటేశ్వరులకు పూజలుగావించెను. అంతేగాక బాలకృష్ణ విగ్రహమును విజయనగరములో పునఃప్రతిష్ఠ చేయించెను. అపుడు ఆయుత్సవమునకు వ్యాసరాయముని గీతములురచించెను.

సాళువతిమ్మరుసు కొండవీటిపై ముట్టడిసాగించి జయించెను. చాలమంది ఓఢ్రదేశపు రాజకీయోద్యోగులు, గజపతి ప్రభుని భార్యాపుత్రులును బంధితులైరి. కొండవీటి విజయానంతరము దాని పాలనాధికారిగా సాళువతిమ్మరుసు నియమింపబడెను. అంత కృష్ణరాయలు భార్యాసమేతముగా అమరావతికిపోయి, అమరేశ్వరుని సందర్శించి పూజలుసల్పెను. తరువాత శ్రీశైలముపోయి మల్లికార్జున దేవునకు అమూల్యములైన కానుకలను అర్పించెను. అహోబలమునందలి నరసింహదేవునకు మ్రొక్కులిడుచు, అచటనుండి పటిష్ఠములగు కోటగోడలుగల కొండపల్లి చేరి ముట్టడించెను. ప్రతాపరుద్రుని సేనలను కృష్ణానదీతీరమున నెదిరించి జయించెను. తెలంగాణాలోని చాలకోటలను, గజపతి ప్రభుత్వములోనున్న నల్లగొండ, వరంగలు జిల్లాప్రదేశములను స్వాధీనముచేసికొనెను.

తరువాత కృష్ణరాయల దృష్టి కళింగదేశముపై పడినది. ఇతని జైత్రయాత్ర పొట్నూరు-సింహాద్రి వఱకు సాగినది 1516 లో నచట శ్రీకృష్ణదేవరాయలు విజయస్తంభమును పాతించెను. కళింగరాజధానియగు కటకమునకు రాయలసేనలు విజృంభించినవి. అపుడు ప్రతాపరుద్రుడు గత్యంతరములేక సంధిబేరమునకు దిగెను. ఆతడు కృష్ణసార్వభౌమునకు తన కుమార్తెనిచ్చి వివాహము గావించెను. ఉదారుడైన కృష్ణరాయలు కృష్ణకు త్తరమునగల సరిహద్దువఱకు రాజ్యమును ఆతని కిచ్చివేసెను. 1520 లో ఇస్మాయిల్ ఆదిల్‌ఖాను రాయ

చూరుమఙల తిరుగుబాటు చేసెను. అపుడు శ్రీకృష్ణదేవరాయలు పదిలక్షల సైన్యముతో నాతనిని యుద్ధముననోడించెను. అందుతనకు సహాయపడిన పోర్చుగీసు సేనాధిపతిని మహానవమి పండుగనాడు చాలగౌరవించెను.

సాళువతిమ్మన కౌండిన్యగోత్రోద్భవుడును, బ్రాహ్మణుడును. ఇతడు ప్రధానామాత్యుడగుటయే శ్రీకృష్ణదేవరాయలు అంతటి పేర్వడయుటకు ముఖ్యకారణము. ఇతడు సర్వమండల పరిపాలనావిధులను సుప్రసిద్ధ మేధావులును. వినయవిధేయతాద్యశేషగుణభాసురులు తనమేనల్లురునగు నాదెండ్ల, అప్పయ, గోపయలపై విడిచిపెట్టెను. తనకుమారుడు తిమ్మన దండనాయకుని సోదరుడు గోవిందామాత్యునిగూడ ఉన్నతోద్యోగము లందే నియమించెను. ఈసాళువతిమ్మననే కృష్ణదేవరాయలు "అప్పాజీ" అని పిలుచుచుండెడివాడు. ఈమహాప్రధాని మహాతంత్రనాయకుడని పొగడ్తకెక్కెను. రాయల ఆరేండ్ల కుమారుడగు తిరుమలయ్యదేవునకు విషప్రయోగము గావించిన కుట్రలో ఈతడుగూడ భాగస్థుడను నపోహతో అంతటి అప్పాజీని పదవీచ్యుతునిచేసి, బంధించి, తుదకు రాయలు తిమ్మరుసును సకుటుంబముగా గ్రుడ్డు పెట్టికించి కనితీర్చుకొనెనట. నిజమెఱిగి పిమ్మటపశ్చాత్తాపముకూడ పడెనట! పాపము!!

తరువాత ఆప్రధాన మంత్రిత్వమును ఉదయగిరి, కొండవీడు దుర్గములపాలించుచుండు అయ్యప్పరసునకు యిచ్చివేసెను. సాళువదండనాయకుడు దక్షిణ తిరువాన్కూరులో

నున్న తిరువాదిరాజ్యమునకును, సింహళములోని రాజ్యభాగములకును పాలనాధికారిగనుండెను. తంజావూరినాయకులలో పూర్వుడగు శివప్పకూడ రాయల పెద్దయుద్యోగులలో నొకడుగనుండెను. ఉత్తరసింహళము జయింపబడి మధురమండలాధిపుని పాలనములోనికి చేర్చబడినది. దానివలన రాయలకు దక్షిణ సముద్రాధిపత్యముకూడ నున్నట్లు రూఢియగుచున్నది.

ప్రభుత్వముచేయు అపారామిత వ్యయములకు వలయు ధనము ప్రజలపై దుర్భరశుల్కవిధి విధానముల మూలమున గ్రహించుచుండిరి. పన్నుల చిక్కులలోబడి చెల్లింపనేరక ఉక్కిరిబిక్కిరియై కాలయాపనచేయువారికి అపరాధసుంకముల గూడ విధించుచుండిరి. చిన్నచిన్న వృత్తులమీదను వివాహాది శుభకార్యముల మీదనుకూడ ప్రభుత్వమునకు అప్పనములను చెల్లించుకొనవలసి యుండెడిది. వెనుక రాయచూరు యుద్ధములో రాయలుమెచ్చుకొనునట్లు అపారబల పరాక్రమ ప్రదర్శనగావించిన భట్టుకు ఆవత్సహాయరనునాతడుతనకు విధింపబడ్డ సుంకములజెల్లింపజాలక నగరువాకిట వేచియుండి రాయలను దర్శించి ప్రార్థించి శుల్కక్షమాపణ బొందినట్లు ఒకశాసనము తెల్పుచున్నది.

తన పరిపాలనారంభకాలమున శ్రీవిరూపాక్ష దేవాలయమునకొక నూతనగోపురమును నిర్మించెను. మఱియొకదానిని బాగుచేయించెను. 1513 లో తాను ఉదయగిరినుండి తీసికొని వచ్చిన శ్రీకృష్ణస్వామి విగ్రహమును తనభవనమున కెదుట

నున్న శ్రీబాలకృష్ణాలయములో దానిప్రక్కనే ప్రతిష్ఠించెను. రాచనగరుచెంత హజారరామస్వామి కోవెలయును, దేదీప్యమానమై అతిశృంగారమై మితిమీరిన శిల్పకళావిలాసముతో వెలసియున్న శ్రీవిఠలస్వామి యాలయమును, ఒకేఱాతితో చెక్కబడిన శ్రీలక్ష్మీనారసింహ విగ్రహమును, ఒరిస్సాను జయించి వచ్చినపిమ్మట ఆజయమునకుగుర్తుగా "విజయభవన" మను నొకదివ్యభవనమును, అనేక సుందరదేవళములను నిర్మించి కృష్ణరాయలు విజయనగరమునకు అత్యంత వైభవము చేకూర్చెను. కాళహస్తి, తిరువణ్ణామలై, చిదంబరము, శ్రీశైలము, తిరుపతి మొదలగు దివ్యక్షేత్రముల యందెక్కువగా మంటపములను, ప్రాకారములను, గోపురములను కట్టించెను. అంతేగాక రాయలు తన విజయయాత్రలు పూర్తియైనపిమ్మట మహోత్సాహముతో తన సామ్రాజ్యమునకు దక్షిణ దిగ్దేశము లన్నిటికిని తీర్థయాత్రకు వెడలి రామేశ్వరము వఱకునుగల సమస్తపుణ్యస్థలములను దర్శించి సేవించుకొనెను.

ఇట్లు చేయుచున్నను వ్యవసాయాభివృద్ధి కరములగు నీటివసతులను కల్పించుటనుకూడ మఱవలేదు. గోవాపాలనాధికారి సమ్మతినిపొంది అచటినుండి ఒకపోర్చుగీసు వాస్తుశాస్త్ర విజ్ఞాని (Engineer) రప్పించి విజయనగరము చుట్టునున్న మెట్టభూములన్నింటికి నీటిసదుపాయములను చేకూర్చెను. రాజధానీనగరమును చేర్చి దక్షిణదిగ్భాగమున తనతల్లియగు నాగలాదేవిపేర తను స్వయముగా శంఖుస్థాపనచేసి కట్టించిన

నాగలాపురము చెంత వ్యవసాయమునకనుకూలమగు నొక గొప్ప చెఱువును త్రవ్వించెను.

దక్షిణ హిందూదేశమంతయు కృష్ణదేవరాయని పాలనలో నుండెను. మఱియు బంకపురము, జరసొప్ప, కాలికట్టు, భట్కాలు మొదలగు దేశపురాజులీతనితో రాజకీయమైత్రితో మెలగువారుకూడ పెక్కుండిరి. సామంతరాజులు కృష్ణరాయల చతురంగబలములను తమతమ శక్త్యానుసారముగా ఆత్మరక్షణార్థము తమస్వంత వేతనములతో పోషించుచు నుంచుకొనుచుండిరి. అంతియేగాక ఏఁటేటను చక్రవర్తికి కప్పములను చెల్లించుకొనుచుండిరి. ఆ కప్పములను సామంతులందఱును విజయదశమికి ముందుగా తమతమ రాజలాంఛనములతో విజయనగరమునకేగి వినయవిధేయతలతో అర్పించుకొనవలసియుండెను.

అట్లు చక్రవర్తి భాండారమునకు చేరిన మొత్తములో సాబాలాయన గృహనిర్వాహణమునకును, సైన్యపోషణార్థమును వినియోగింపబడుచుండెడిది. ప్రధాని, కోశాధ్యక్షుడు, భూమ్యధిపతి, నగరరక్షణాధికారి, అశ్వసర్వాధికారి, ఆభరణరక్షకుడు, దైనికకార్యకలాపలేఖాధ్యక్షుడును రాయల ప్రభుత్వములో ముఖ్యోద్యోగులుగా నుండిరి. ప్రతీమండలాధిపుని యొద్దను రహస్యరాయబారులు నియమింపబడి ఎప్పటివార్తల నప్పుడే చక్రవర్తికి చేరవేయుచుండిరి.

రాయలసేన విశేషము కాల్బలము మీఁదనే ఆధారపడియుండెను. ఆశ్వికసేనాభివృద్ధికై యాతడు నిత్యమును

పాటుపడుచుండెను. పోర్చుగీసువారినుండి ప్రశస్తమైన అరబ్బీ గుఱ్ఱములను, పారశీకగుఱ్ఱములను కొనుచుండువాడు. యుద్ధములందు గాయపడ్డ గుఱ్ఱములను చికిత్సచేయుటలో తాను స్వయముగా శ్రద్ధవహించుచుండువాడు. గజసైన్యమును మాత్రము పూర్వపువిధానముననే యుంచివేసెను. పదాతి దళమునకు కత్తులతోడను, బల్లెములతోడను, ఈటెలతోడను, బాణములతోడనేకాక తుపాకులతోకూడ యుద్ధముచేయుట నేర్పబడుచుండెను. రాయచూరు, కొండవీడు ముట్టడులందు పెద్దపెద్ద పిరంగులను, ముట్టడితుపాకులను ఉపయోగించుట క్రొత్తగా ప్రవేశపెట్టబడినది.

రాజులకు మృగయావిహారము చంద్రగుప్తమౌర్యుని కాలమునాటి వలెనేయుండెను గాని సంస్కరింప బడలేదు. సైనికుల సమరకౌశలము యుద్ధములందేకాక వార్షికపరిషత్తులందు కూడ ప్రదర్శింపబడి బహుమతులొసగబడుచుండుట గొప్పగా విదేశీయులచే శ్లాఘింపబడినది. రాయలకు 35.000 మించిన కవచధారులగు ఆశ్వికయోధులుండిరి. ప్రతియేనుగుమీదను నలుగురేసి యోధులు తనుత్రాణులై విల్లంబులు, కత్తి, డాలు, యీటె మొదలగు ఆయుధములుధరించి అంబారీలలో నుండి యుద్ధముచేయు చుండెడివారు. ఏనుగుల దంతములకు రెండువైపులను పదునుగల కత్తుల నమర్చెడివారు.

## స్వర్ణయుగము.

శ్రీకృష్ణదేవరాయలు రాజకంఠీరవుడేకాక తానుకూడ కవియై కవిపండితలోకము నాదరించెను. అష్టదిగ్గజములను పేరు

వడసిన అల్లసాని పెద్దనాదులీతని యాస్థానము నందేయుండిరి. కృష్ణరాయలు అల్లసాని పెద్దన్నను ఆంధ్రకవితా పితామహు డను బిరుదుతో సన్మానించి కవిగండ పెండేరమును తొడిగెను. ఆనాటి పద్యరచనకు పెద్దనార్యుని మనుచరిత్రకావ్యము అత్యుత్తమమైనది. అతని హరికథాసారమను గ్రంథము సంపూర్ణముగా నిప్పుడు లభించుటలేదు. రాయలకు పెద్దనయెడ గాఢ భక్తివిశ్వాసములుండి యుండెను. అందుచే ఆయనకు ఘన సన్మానములు కావించుటయేగాక కోకటగ్రామాద్యనేకాగ్రహారంబులడిగిన సీమలయందొసంగి గౌరవించెను.

ముక్కుతిమ్మనయను నామాంతరముగల నందితిమ్మనామాత్యుడు శ్రీకృష్ణరాయల దేవేరియగు చిన్నమాంబాదేవి అరణపుకవి. ఈయన కావ్యరచనా మార్దవము కడుంగడు ముద్దులుమూట గట్టినట్లుండును. కావుననే "ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు" అని తెనాలిరామకృష్ణ కవిచేతనే పొగడబడినాడు. ఈయన పారిజాతాపహరణమను ప్రబంధమును వ్రాసి రాయలకంకిత మిచ్చెను. దీనికొక ఐతిహ్యము కలదు. "ఒక నాటిరేయి కృష్ణరాయలు శయనించుటకై చిన్నాదేవియంతిపురికి కొంతయాలస్యముగా పోయెను. ఆమెయు వేచివేచి తలవైపుదిక్కున కాళ్ళిడుకొని నిద్రపడిపోయెను. ఆతలవైపుననే కృష్ణరాయల చిత్రపటముండెను. రాయలువచ్చి చూచి అమె తన చిత్రపటమువైపున పదములిడుకొని నిద్రించుచుండుటను తన్ను పాదములతో తాచుటగాభావించి కోపించి వెనుదిటిగి

పోయి కొంతకాలమామె మొగమును చూడకుండెను. ఆమె కొంతకాలమునకు తనయపరాధమును గ్రహించుకొని తిమ్మన గారికెఱిగింపగా ఆయన సత్యభామ క్రోధావేశమున శ్రీకృష్ణ భగవానునితాచిన ఘట్టముగల పారిజాతాపహరణ ప్రబంధ మును రచించి రాయలకు వినిపించి ఆయనకోపమునుడుపి యథారీతిని ప్రవర్తించునట్లు చేసెను. దీనినిపట్టియే తిమ్మ నార్యు ప్రతిభావిశేషము తెల్లమగుచున్నది. ఇందీయన రాయల చరిత్రాంశములనుకూడ కొంతవఱకు వివరించి యున్నాడు. కాబట్టి ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకులు వీను లకు తేనెసోనలు.

రాయల ముఖ్యమంత్రియగు సాళువతిమ్మరుసు, అతని భాగినేయులు నాదిండ్ల, అప్పయ, గోపయామాత్యులుకూడ ఆంధ్రసారస్వతమున కొంతపేర్వడసిరి. ఆనాటి లొల్ల లక్ష్మీ ధరకవి సంస్తవనీయుడే. అతడు ప్రతాపరుద్రగజపతి ఆస్థానకవి యై యుండి రాజకీయశాసనములను కొన్నింటిరచియించి ఘన సత్కారము లొందియుండెను. అతడు సరస్వతీవిలాస కావ్య మును రచించెను.

శ్రీకృష్ణదేవరాయలు పోషణములో వ్యాసరాయలను గొప్పద్వైత పండితుడును తిమ్మనయను కన్నడకవియుకూడ నీతని ఆస్థానమునందే యుండిరి.

డిండిమ వంశజుడగు సభాపతియనువాడు ఆరణిచెంత నున్న ముల్లంధ్రపురనివాసి. ఈయన రాయల ఆస్థానమునందలి

సుప్రసిద్ధ సంస్కృతకవి. ఈ వంశములోనివాడేయగు రాజనాథ కవి సాళువాభ్యుదయమును అచ్యుతరాయాభ్యుదయము నను రెండు కావ్యముల రచించెను.

కృష్ణదేవరాయలు పైవిధముగ సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో నున్న పెద్దపెద్దకవులను పోషించెను. తాను కూడ విష్ణుచిత్తీయమను నామాంతరముగల ఆముక్తమాల్యద యను ఆంధ్రప్రబంధమును రంచించెను. అది తెనుగుపంచకావ్యములలో నొకటిగ వాసికెక్కినది. అది ఆంధ్రవాఙ్మయములో వైష్ణవమత సాంప్రదాయములకు రత్నఖనియై యొప్పెను. ఆకావ్యమునందలి శైలి కొంచెము క్లిష్టముగానున్నను అలంకారములు వర్ణనలు మానవమనస్తత్వములును కనులకు కట్టినట్లుతిస్వాభావికముగ వర్ణింపబడినవి. సహజసౌందర్య వర్ణనల కితనికిసాటి చేయి వేరొండులేదు. ఈ ప్రబంధమునందలి ఇతివృత్తము భగవానుడగు శ్రీరంగనాథునకు శ్రీవైష్ణవయోగియైన పెరియాళ్వారు స్వయముగ తనకుమార్తెయగు ఆనండల్ అమ్మాళ్ళను యిచ్చి వివాహము కావించినకథ. ఆకావ్యములో నాలుగవ ఆశ్వాసమున రాజనీతివిషయములు పెక్కులు వివరింపబడినవి. వానినిపట్టి రాయలకు పరిపాలనావిధులందును, యుద్ధరంగములందునుగల ఆత్మానుభవజ్ఞానము సంపూర్ణముగా వ్యక్తమగుచున్నది. రాజు శాస్త్రములందు చెప్పబడినట్లు న్యాయమార్గానువర్తికాకున్నచో తనజీవితాంతమున నరకబాధ తప్పదని ఉద్ఘాటించబడినది. కావున ప్రభువుతనతరణోపాయార్థము భగవంతునిపై ఆధారపడి యుండవలెను.

మొత్తమున విజయనగరసామ్రాజ్యమీతని పాలనలో సత్యున్నతిని పొందెను. విజయనగరమేలిన చక్రవర్తులందు రాజ్యవిస్తీర్ణమునందుకాని రాజ్యపరిపాలనా సామర్థ్యమునందు గాని బలపరాక్రమములందుగాని సాహిత్యపోషణయందుకాని ఔదార్యమునందుగాని వ్యవసాయాభివృద్ధి, నగరాభివృద్ధుల యందుగాని సరస రసికతా విశేషమునగాని శ్రీకృష్ణదేవరాయలను సాటి నభూతోనభవిష్యతి. ఆంధ్రుల ప్రతిభావిలాసముల కాతడే ధ్రువతార.

## అచ్యుతదేవరాయలు.

శ్రీకృష్ణదేవరాయల జ్యేష్ఠపుత్రుడు మరణించుటచేతనే రాయల సవతిసోదరుడగు అచ్యుతదేవరాయలు పట్టాభిషిక్తుడయ్యెను, ఇతడు కృష్ణరాయలు జీవించి యుండగనే కొంతకాలమునుండి సహపాలకుడుగ నుండుచుండుటచే నీయవకాశము లభించినది. అతడు రాజనాథుని అచ్యుతాభ్యుదయములో వివరించినట్లు తిరుపతిలో నొకమారును, కాళహస్తిలో నొకమారును, విజయనగరమందొకమారునుకూడ పట్టాభిషేకములు కావించుకొనెను. కాని ఇతనిసామ్రాజ్య పదవికిసలకము పెదతిరుమలరాయలును, చినతిరుమలరాయలునుకూడ వేర్వేర పోటీ చేసిరి. వారిరువురు బావమరుదులేయగుటచేత వారిరువురకును ముఖ్యమంత్రి పదవులొసగి గౌరవించుటతో ఈముమ్మూర్తుల తగవు తెగిపోయినది. శ్రీకృష్ణదేవరాయల అల్లుండ్రగు అళియ రామరాజును ఆతనిసోదరుడు తిరుమలరాజునుకూడ రాజ్యపా

లనయందు ఘనపదవులొసగి గౌరవించుటలతో శాంతియుత వాతావరణ మేర్పడినది.

కాని మొత్తముమీద అచ్యుతరాయల పరిపాలనా కాలమంతయును కోటలోపలను కోటవెలుపలను జరుగుచుండు తిరుగుబాటుల నణచుటలకే సరిపోయినది. ఇతని బావమరదు లగు సకలముసోదరుల నిరంకుశ పరిపాలన కారణముగా ప్రజ లయందును పాలకులయందునుకూడ అసంతృప్తి జనించినది. అందుచేతనే నన్నిజ్‌గారు వీరిరువురుని "బలాత్కరించు యూ దు"లని పేరుపెట్టి యున్నారు. ఈసకలముసోదరుల మంత్రాం గము మూలకముగా ముదుకలుకోట జారిపోయినది. దేశము నందెల్లెడల అసంతృప్తి బయలుదేరి పెక్కు అంతఃకలహములకు దారితీసినది. రెండవఫలితము చెల్లప్ప వీరనరసింహనాయకుడు ఎదురుతిఱిగి తిరువాది రాజ్యప్రభుడగు చేరరాజు నాశ్రయిం చెను. ఆప్పుడు అచ్యుతరాయలు స్వయముగ శ్రీరంగముపై కెత్తిపోయెను. తనముఖ్యమంత్రి సకలముతిరుమలరాజు మధుర, తిరునల్వేలి రాజ్యములపై దండెత్తి తిఱుగుబాటు కావించిన తిరువాది నాథుని, అతనిని శరణుజొచ్చిన వీరనరసింహనాయ కునికూడ నడచి వేసెను. మధురాపురనాయక వంశమూల పురుషుడగు నాగమనాయకుని కుమారుడు విశ్వనాథనాయకుడు ఈయుద్ధములో ప్రముఖపాత్రవహించి పాండ్యదేశములో కాలూనగల్గెను. ఈయుద్ధములో నింకొకభాగస్థుడగు విఠల దేవుడను మఱియొక సేనానాయకుడు సర్వసేనాధిపత్యము

వహించి తిరువాదినాయకునితో బోరి జయించెను. తరువాత పాలనలో తిరువాది రాజ్యము తిరిగి వారి కొసగబడెను.

కృష్ణదేవరాయలు మరణించిన ఉత్తర క్షణమందే ఇస్మాయిల్ అదిల్ షా రాయచూరును ముదుకలుకోటనుముట్టడించి మూడుమాసములకు దానిని స్వాధీన పరచుకొనెను. 1531 లో వ్రాయబడిన యొకశాసనమును బట్టి గజపతి రాజు కూడ అదేవిధముగా కృష్ణానదికి దక్షిణ ప్రాంతము నెల్ల జయించినట్లు తెలియుచున్నది. కొండపల్లెను జయించిన గోల్కొండ నవాబగు కులీకుతుబ్ షా ఈతనికి సాయపడెను. 1534 లో అచ్యుతరాయలు బెజవాడయందుండగా ఈ అలీ కుతుబ్ షా వెనుకకు తగ్గి ఒక క్రమమైన సంధి నిర్ణయమునకు వచ్చెను. కొంత భాగము నాక్రమించిన అదిల్ షానుండి అచ్యుతరాయలు రాయచూరును ముదుకల స్వాధీన పరచుకొనెను. అప్పటినుండియు. అదిల్ షా ఎన్నియో మారులు విశ్వప్రయత్నములు చేసెను. కాని అవి యన్నియును విఫలమగుచునే వచ్చెను.

అచ్యుత దేవరాయలు గొప్పదాత. అతడు అసంఖ్యాకములగు దానముల గావించుటచే నాతనికి "నవకోటి నారాయణు" డను బిరుదు కలిగెను. ఆయన ఆస్థానకవియగు రాజనాధడిండిముడు భాగవత చంపువును వ్రాసి కృతినొసంగెను. అచ్యుతదేవరాయల పరిపాలనారంభకాలమున తిరుమలాంబ యను నొక యువతి "వరదాంబాపరిణయ" మను నొక ప్రబం

ధమును రచించి అందు రాయలు వరదాంబికను వివాహ మాడిన కథను వ్రాసి ఆయనకు కృతినొసంగెను; వ్యాసరాయ తీర్థులను మధ్వయోగి అచ్యుతరాయల ఆస్థానమునందుండెను. ఆస్థానమునందీతనికి గొప్ప పలుకుబడి యుండెను. కనుక ఈయన అచ్యుతరాయల ఆస్థానమునందు ఆతని కుమారుడగు వెంకటాద్రి యౌవరాజ్య పట్టాభిషేకము జరుగువరకునుకూడ నుండెను.

## వెంకటాద్రిరాయలు

1541 లో అచ్యుతరాయలు మరణించెను. అనంతర మతని కుమారుడు వెంకటాద్రిరాయలు పట్టాభిషిక్తుడై సింహాసనమధిష్ఠించెను. ఈతడు యువకుడు. ధర్మమార్గానువర్తి, ఉదార స్వభావుడు. పాపమీ ధర్మమూర్తి ప్రజల దురదృష్టమున 1542 లో అచ్యుతరాయల మేనల్లుడు లేవదీసిన తిరుగుబాటులో హత్య కావింపబడెను.

అచ్యుతరాయలు మరణించి అతని కుమారుడు వెంకటాద్రి సింహాసన మెక్కుటతోడనే మరల అంతఃపుర కలహములు చెలరేగినవి. వెంకటాద్రి సింహాసనమధిష్ఠించునరి కింకను యౌవనారంభ దశలోనుండి రాజకీయ పరిజ్ఞానమునం దింకను నారితేరినవాడు కాకపోవుటచే అచ్యుతరాయల కాలమునుండి యును రాజ్యాదురాక్రమణ సమయమునకే నిరీక్షించుచున్న కృష్ణరాయల అల్లుడు అళియరామరాజును, అచ్యుతరాయల బావమరుదులు సలకము సోదరులును ఈ యదను

కనిపెట్టి కుట్రలను లేవదీసిరి. అందు అళియ రామరాజును అతని సోదరులగు తిరుమలరాజు, వెంకటాద్రి రాజులును కలసి కర్నాటక రాజ ప్రతినిధులలో సాళువ వంశమునకు చెందిన జ్యేష్ఠ వారసుడును, చనిపోయిన అచ్యుతరాయల తమ్ముని కుమారుడును, తమకు మేనల్లుడునైన సదాశివరాయల పక్షము వహించిరి. రాణి యగు వరదాంబిక అభ్యర్థనపైనాపె సోదరులు సలకము పెదతిరుమలరాయుడు చినతిరుమల నాయకుడును యాజమాన్యములు వహించి కక్షల నడుపుచుండిరి. రాజ్యమును తామహరించు దురుద్దేశముతో ప్రతి పక్షులగు అళియ రాజాదులపై నీ నిందపడిపోవునను యూహతో తమ్మా శ్రయించిన వెంకటాద్రిని రహస్యముగా సలకము సోదరులే హత్య గావించిరి. కంచెయే చేనుమేసిన గలదెదిక్కు! అన్నట్లయినది వెంకటాద్రి బ్రతుకు. ఎలుకపోయి పిల్లి నాశ్రయించినది పాపము! వరదాంబిక ఎంత అమాయకురాలో గదా! తుదకు సింహాసనములభించలేదు సరేకదా చినతిరు సలకము పెదతిరుమలరాజుకూడ సంహరింపబడెను. 1543 లో సదాశివరాయలను సింహాసనమెక్కించి యాతని పేరున అళియ రామరాజు తానే రాజ్యపాలన గావించుచుండెను.

సదాశివరాయలు.

ఇతడు సింహాసన మెక్కునరికి పదునారు వత్సరముల వాడు. అందుచే నాతని పేరున అళియరామరాజు పరిపాలన సాగించుచుండెను.

ఈ రామరాజు పాత్ర తెలుగుకావ్యమగు వసుచరిత్ర,

నరసభూపాలీయ గ్రంథము లందును, వెంకయ్యకవి నరపతి విజయమునందును. రామామాత్యులవారిని స్వరమేళకళానిధి యందును, అనంతపురమున లభించిన మహారాజుల దైనికచర్య గ్రంథములందును చక్కగ వర్ణింపబడియున్నది. సలకము సోదరు లిరువురిలో జ్యేష్ఠుడగు తిమ్మరాజును సంహరించి రామరాయలు కర్నాటక రాజ్యమును నిల్పినట్లు శాసనముల వలన నిర్ధారణమగు చున్నది. వానిలో మహాకర్నాటక రాజ్యమును స్థాపించిన వాడనియు "ప్రాజ్యకర్నాటక రాజ్యస్థాపనాచార్య"యనియును బిరుదు లొసగబడియున్నవి.

అళియరామరాజు సాళువ నరసింహారాయల సైన్యాధిపతియగు ఆర్వీటి బుక్కరాయల వంశస్థుడు. ఈతని తండ్రి శౌర్యధైర్య సాహసములుకలవాడును, సమరవిద్యాకుశలుడును, శ్రీకృష్ణదేవరాయల మండలాధిపులందరిలోను గొప్ప పేరు పొందినవాడును. అగుటచేత అతని కుమారుడగు రామరాజునకు కృష్ణరాయలు తన కుమార్తెనిచ్చి వివాహముగావించెను. అప్పటినుండియు నీతడు అళియరామరాజని వ్యవహరింప బడుచుండెను.

అళియరామరాజు సదాశివరాయలను సింహాసన మెక్కించి తానే రాజప్రతినిధిగను, రాజరక్షకుడుగను నుండెను. రాజ్యాంగ వ్యవహారము లన్నియు గుత్తకు పుచ్చుకొన్న వానివలె 1550 వఱకును రాజప్రతినిధిగానే ఉండెను. పిమ్మట రాజును చెఱయందుంచెను. రాజ మర్యాదలను మాత్రము

సదాశివరాయలకు చక్కగ నడుపు చుండెను ఇట్లు కొంత కాలము నడచిన పిమ్మట రాయలతో సమానముగా అన్ని అధికారములును తనకుగూడ కలవని ప్రకటించెను అధికారపు టుత్సవుల అన్నింటి యందును రాజుతో సమానముగా తానుకూడ చేవ్రాలు చేయుచుండెను. ఈ విధముగా 1563 వఱకును నడిపించెను. ప్రభువు నీ విధముగా మోసగించి రాజ్యము నపహరించుట రామరాజు సోదరులకు సమ్మతికాక పోవుటచే అన్నగారితో కొంతకాలము వరకును పోరాడిరి కాని లాభము లేకపోయెను. 1563 కు పిమ్మట నుండియు తానే చక్రవర్తినని బహిరంగముగ ప్రకటించెను. సార్వభౌముని బిరుదము లన్నియు తానే ధరించెను. అంతటినుండి ఇక సదాశివరాయల ప్రసక్తిని పూర్తిగా విడిచి పెట్టెను. కాని రామరాయలు పట్టాభిషేకోత్సవమును మాత్రము కావించు కొనలేదు. అట్లు చేసినచో ప్రజల తిఱుగుబాటు బయలు దేరు నని జడిసియుండవచ్చును.

## అళియ రామరాజు

సదాశివరాయల పరిపాలనారంభ కాలమున అళియ రామరాజు ఉదయగిరి దుర్గాధ్యక్షుడుగా నుండెడివాడు. ఇతడు తన జీవితకాలమున విశేషభాగమును యుద్ధములతోడనే గడపెను. తను రాజప్రతినిధి పదవి వహించి రాజ్యదురాక్రమణము కావించు సంవత్సరములందు ఇతడు చాలయుద్ధము లందు పోరాడెను. అందుమనము ముఖ్యముగా గుర్తునందుంచు

కొన దగినది తిరువాది రాజ్యముపై వెడలిన దండయాత్ర. మధుర నాయకుడగు విశ్వనాథ నాయకుడును, అతని పెద్దకుమారుడు కృష్ణప్ప నాయకుడును సహాయులైయుండగా రామరాయలసోదరుని కుమారుడగు విఠ్ఠలదేవమహారాజు ఆధిపత్యము వహించి యీ యుద్ధమును నడిపించెను. తిరువాన్కూరు ప్రభుడగు నున్ని కేరళవర్మ నాగరకోయిల్ చెంతనున్న కొట్టారువరకునుగల ఆరనోయ మొాలి కనుమగుండా నడచివచ్చి విఠ్ఠల్ దేవుని మీాదకు దండెత్తివచ్చుచుండెను. కాని విఠ్ఠల్ సమీాపమునకువచ్చుసరికి తనముఖ్య స్నేహితుడగు సెంటుఫ్రాన్సిస్ క్సావియరు (St. Francis Xavier) యొక్క అద్భుతమైన మధ్యవర్తిత్వము మూలముగా ఆకస్మికముగా నా దండయాత్ర విరమింప బడినది. చిట్టచివరకు 1547 లో ఇరు కక్షుల వారిచేతను శాంతి పత్రములపై సంతకములు కావింపబడినవి. అందు విజయనగర రాజునకు తిరునల్ వేలి యొసగబడినది. పైగా తిరువాదీ ప్రభువు విజయనగరరాజునకు ఏటేట కప్పము చెల్లించుటకు సమ్మతించెను. సుచీంద్ర దేవాలయమున విఠ్ఠల్ మహారాజు జన్మదినోత్సవము జరిపించబడెను. దత్తభాగములకు విశ్వనాథ నాయకుడు అమరనాయకుడుగా నియమించబడెను. 1558లో విఠ్ఠల్ రాయనిచే తిరువాది రాజ్యముపై మూడవ పర్యాయము దండెత్తబడెను. కాని ఈ తడవ గొప్ప రక్తపాతమైన గాని ముట్టడి నెట్టివేయబడలేదు.

దక్షిణ భారతములోని మహమ్మదీయ సుల్తానులలో

ఐకమత్యము కుదరనీయకుండుటకే రామరాజెల్లప్పుడును పాటు పడుచుండెను. కొంతకాలము నడచెను. ఈ కార్యము జయప్రదముగనే నడుపబడినది. కాని చిట్టచివర నడచెను కృతకృత్యుడు కాలేకపోయెను. రామరాజు షోలాపురము కల్బర్గాలను తీసుకొనుటకును, నిజాముషా రాయచూరు ముదుకలు కోటలను పట్టుకొనుటకును వారిరువురును సంధికుదుర్చుకొనిరి. నాలుగు సంవత్సరములలో రామరాజుకు, ఇబ్రహీమ్ అదిల్షాలకు సఖ్యమేర్పడెను. 1555-57 లలో పెద్ద సైన్యముతో అహమదు నగర ప్రభువునుండి కల్బర్గాను రక్షించుటకు ఇబ్రహీము అదిల్షా సహాయపడెను. 1557 వ సం॥ లో యువకుడగు అదిల్షా తన రాజ్యాధికారము చేకొనుటకు రామరాజు సహాయము చేసెను. మరల 1558 లో కల్యాణ దుర్గమును స్వాధీన పరచుకొనుటకు అహమదునగరము, గోలకొండల నవాబు లిరువురును కలసి వచ్చుచుండుటచే వారినెదుర్చుటకు అదిల్షా రామరాజు సహాయముకోరెను. రామరాజు తన సోదరుడగు వెంకటాద్రిని గోల్కొండరాజ్య దక్షిణ జిల్లాల నెదుర్చుటకై పంపెను. అతడు కొండపల్లెను, బందరును ఇంకను ఇతరకోటలను తీసికొనెను.

అచ్యుతరాయల కాలమున కూడ పోర్చుగీసు వారి దృష్టిలో విజయనగర రాజ్యపరిపాలన శాంతముగనే నడచి పోయినట్లుండెను. 1544 వ. సం॥లో పోర్చుగీసువారు దక్షిణ హిందూ దేవాలయములను దోచుకొనుటకు నలువైపులకు

పెద్ద పెద్ద సేనలను పంపిరి. కాని ఎటుబోయిన వారటనే పరా భవింపబడి మరిగిడివచ్చిరి. దానితో వారి కా యాస అడియాస యైనది. 1546 - 47 లలో వారు రామరాజుతో సంధి నియమముల పూర్తిగావించుకొనిరి. ఆ సంధి నియమముల ప్రకారము విజయనగరాధీశులు గోవాలో దిగుమతి కావింపబడిన అరబ్బీయపారశీక తురంగముల నన్నింటిని మొత్తముగా గొనునట్లును, హైందవ వర్తకవ్యాపారులు తమతమ సామగ్రులను హానోవరు బార్సెలూరు రేవుల నుండియే విదేశములకు పంపించుకొనుటకును, వాని నన్నింటిని పోర్చుగీసు దేశము నందలి వర్తకులు మాత్రమే కొనవలసినట్లును, ఇనుమును, సూరేకారమును బీజపూరు రాజ్యమునకు పంపకూడదనియును హిందువులకు కావలసిన విదేశవస్త్రము లన్నింటిని హానోవరు నందలి పోర్చుగీసు వర్తకుల యొద్దను మాత్రమే వెల యిచ్చి పుచ్చుకొనవలెననియును వానికై చెల్లించవలసిన మూల్యము నాణెముల రూపమున కాకుండగా, రాగి ప్రవాళి ములు, సిందూరము, ఇంగిలీకము, పాదరసము, చీనాపట్టు వస్త్రములు మొదలగు వస్తువుల రూపమున మాత్రమే చెల్లింప బడవలెననియును నీమము లేర్పరచుకొనిరి.

శత్రు సరిహద్దులలో ముఖ్యముగా అహమ్మదు నగరము, బీజపురముల చెంత రామరాజు సేనలు కావించిన మహమ్మదీయ మతవినాశక కృత్యముల ఫలితముగా తల్లికోట చెంత జరిగిన రామరాయల ఓటమియనంతరమున ముసల్మానులు

విజయనగర రాజ్యముపై తిఱుగుదెబ్బతీయుటకు కారణమైనది. హిందువులు తమకు అత్యంతసైన్యము కలదని గర్వము పొందు చుండిరి. ఆదిల్షాకును అతని పినతండ్రి అబ్దుల్లాకును అహమ్మదు నగరమున వైరములు సంభవించినవి. అబ్దుల్లాపోయి పోర్చుగీసు వారిని శరణువేడెను. అదిల్షా రామరాజు నాశ్రయించెను. ఆయుద్ధమునందు రామరాజు సేనలు అబ్దుల్లాను, పోర్చుగీసు వారిని చావగొట్టి అదిల్షాకు జయముచేకూర్చినవి. అంతియేగాక రామరాజు సైన్యములు రెండుమారులు సింహాళము మీాదకుకూడ దండయాత్రకుపోయి జయమంది వచ్చినవి. వీనిలో మొదటి దండయాత్రయందు కాండీప్రభువు పోర్చుగీసు వారి సహాయము కోరెను. దక్షిణ విజయనగరరాజ్య ప్రతినిధియగు విఠ్ఠలనాయకుని చేతను, మధురాధిపతియగు విశ్వనాథ నాయకునిచేతను నడుపబడిన యీా మిశ్రమసైనికులకు కాండీ నరపతియు పోర్చుగీసు సేనలునుకూడ ఓడిపోయినవి. మఱుచటి దాడిలో విశ్వనాథనాయకుని కుమారుడగు కృష్ణప్ప నాయకుని సేనలకు మరల కాండిసేన లోడినవి.

ఈ విధముగా రామరాజు గొప్పయోధాగ్రేసరుడును, దక్షిణ భారత దేశము నందలి యావద్రాజశేఖరులలోను గొప్ప ప్రతాపశాలియగు పాలకుడుగాను నెంచబడుచుండెను. ఇతడు రాజ్యపరిపాలనా విధానములలో నేవిధమైన మార్పులను చేసియుండలేదు. కాని లోపములను మాత్రము కావించెనని చెప్పక తప్పదు. విజయనగర రాజులు పూర్వము నుండి

యును మహమ్మదీయులనుకూడ తన సేనలలో చేర్చుకొను చుండువారు. కానివారిపై యాధిపత్యమును మాత్రము హిందూనాయకులకే ఒసగుచుండెడివారు. ఇతడట్లుగాక విశేషముగా మహమ్మదీయులను తన సేనలలో చేర్చుకొనుటయే గాక వారిపై పాలనాధికారములనుకూడ మహమ్మదీయులకే యిచ్చెను. వీని పూర్వులెవ్వరును రాజకీయాంతరంగిక వ్యవహారములను అతివిశ్వసనీయులగు హిందువులలోను తమ ఆప్తులకేగాని తెలియనిచ్చువారుకారు. వానియందు జోక్యములనసలే ఎవ్వరికిని కలుగనిచ్చువారునుకారు. ఇతడు మహమ్మదీయులను విశ్వసించి మహమ్మదీయులుమాత్రము తన్నేమి చేయగలరని గర్వించి సమస్తరాజకీయ గుట్టుమట్టులను వారికెఱిగించి వానిలో జోక్యములనుకూడ కలుగజేసెను.

ఈ విధముగా తన ఆధిక్యత పెరుగుటతో గర్వించి రాజకీయమైన అన్ని జాగ్రత్తలనుకూడ విస్మరించి గాలికి విడచిపెట్టెను. ఏదియెట్లున్నను పాపము తన కోటను బలపరచుకొనుటలో మాత్రము అశ్రద్ధ చేయలేదు. ఉత్తరపు సరిహద్దు పొడవుననుగల గుట్టలపై కోటలనిర్మించి మిగుల జాగ్రత్త వహించి యుండెను.

రాయల గొప్పతనమునకు దక్షిణదేశమునందలి సులానులయందు అసూయాద్వేషములెక్కువై ఒక్కమారుగా మహమ్మదీయు లందఱును కూడబలుకుకొని పూర్వ వైరము లన్నిటిని విడిచిపెట్టి ఏకమై ఒక్కమారుగా విజయనగరము

మీఁదకు దాడిచేయుటకు తంత్రములు పన్నుచుండిరి. ఇందుకు రామరాజు వెనుక అహమ్మదు నగరముపై దాడిసల్పినపుడు తన దళము లచటగావించిన మత విద్వేషకమైన, అహంభావ పూరితమైన, దౌర్జన్యకృత్యములును, అమర్యాద నడవడులును తోడుపడినవి. అందులకై మహమ్మదీయు లందఱు నీతనిపై కక్షగట్టి వెనుకటి దారుణ చర్యలకు తిఱుగ పాఠముచెప్ప నిశ్చయించుకొనిరి.

ఒక్కప్పుడు తన చిన్న కుమారుఁడొకఁడు చనిపోయెను. అంతకుముందు కొలదికాలము క్రిందటనే సింహాసనమునకు వచ్చి పిన్నవయస్కుఁడైన బీజపురసుల్తాను ఆలీఅదిల్‌షా గడుసుతనముగా ఆలోచించి ఆ సమయమున విజయనగరమునకేగి మహారాజును మిక్కిలి వినయముతో పరామర్శించెను. పుత్రశోక సంతాపముతోనున్న యా దంపతులకు ఆతనిపై ఒక అనిర్వాచ్యప్రేమ కలిగినది. అప్పుడు మహారాణి "ఈ అలీఆదిల్‌షా నేటినుండి నా పెంపుడు కుమారుఁడ"ని అంతనుండి వారతనినమితానురాగముతో చూచుకొనుచుండిరి, అంతటి అభిమాన పుత్రుడైన ఆలీఆదిల్‌షాకూడ ఈ మత విద్వేషకచర్యలందు పితృ సమానుడగు రామరాజునకు వ్యతిరేకముగా జరిగిన సంధి పత్రముపై తొలి సంతకముచేసి స్వజాతి కూటములో చేరిపోయెను. ఇతడే యీ కుట్రకును తిఱుగ బాటునకును ముఖ్యుడును ప్రథముడును కూడయని చెప్ప నొప్పును. దీనిని బట్టియే యవనుల మతపు పట్టుదలలెంత

గాఢముగా నూహింపనగును. ఈ దండయాత్ర జయప్రద ముగా కొనసాగగల్గుటకై వారిలోవారు పరస్పర వైరములను విడచిపెట్టి దృఢముగా పని చేయుటకుగాను వారు గాఢమగు వివాహబంధములనుకూడ ముడివెట్టుకొనిరి. నిజామ్‌షా తన కుమార్తె యగు చాంద్‌బీబీని అదిల్షాకును, అదిల్షా సోదరిని హుస్సేను జ్యేష్ఠకుమారునకును ఇచ్చి వివాహములు కావించిరి. అదిల్‌షాకు వరకట్నముగా అతడు కోరుకొన్న షోలాపురదుర్గ మును ఇచ్చుటకు సమ్మతించెను.

1550-91 వఱకును పాలించిన ఇబ్రహీము కుతుబ్ షాయును 1554-65 వరకును పాలించిన హుస్సేన్ నిజాముషా యును రామరాజునెడ తీవ్రమగు నసూయను కలిగియుండిరి. బీడారు సుల్తాను బరీద్‌షాకూడ ఈ కూటమిలో చేరెను కాని బీరారు సుల్తాను ఇమాద్‌షా మాత్రము ఇందులకు పూర్తిగా సమ్మతించలేదు.

ఈ కూటస్థులందఱు బీజపురమునందు సమావేశమై కూడబలుకుకొని 1564 వ సం॥ డిశంబరు చివరి దినములలో తమతమ సేనలతో బయలుదేరి 26-12-1564 వ తేదీని తల్లి కోటయను చిన్నకోట చెంతకు చేరిరి. రామరాయులును ఈ సంగతిని తెలిసికొని 1564 వ సం॥ సెప్టెంబరు 15 వ తేదీ విజ యదశమినాడు తన సామంతులందఱకును ఈ వార్తను ఎఱిగించి తమ తమ బలములతో సిద్ధపడి రావలసినదిగా ఆజ్ఞలుపంపెను. ఉభయ సేనలును తల్లికోటచెంతకే చేరినవి. ఇది కృష్ణానదికి

ఉత్తరముగా 20 మైళ్ల దూరమునందున్నది.

బీజపురసైన్యము కిష్వారుఖాను ఆధిపత్యమున నడుపబడుచుండెను. గోల్కొండ దళములు ముస్తాఫాఖాను యాజమాన్యమున నుండెను. నిజమ్‌షాహీ దళములు యినయతుల్లాఖాను ఆధీనముననుంచబడెను. మహామ్మదీయ యోధులందఱు కలసి మొత్తము 10.000 ఆశ్వికులును. 3,000 పదాతులును మాత్రముండిరని తెలియుచున్నది. ప్రతిపక్షమున డెబ్బది వేల గుఱ్ఱపు దళమును, తొంబది వేల పదాతులు నుండిరట. అంతేగాక పెక్కండ్రు శిబిరనాయకులును, కందారాయుళ్ళును, నిరర్థకులగు సోమరిపోతురాజులును అసంఖ్యాకులుగా వచ్చిరి. రాయల సోదరులగు వెంకటాద్రిరాయలును తిరుమలరాజును కృష్ణానదికి దక్షిణ తీరమువఱకును ముందుకుపోయి సేనావాసములు జేసికొనుటకై మట్టి దిబ్బలపై ఫిఱంగులను తుపాకులను అమర్చుకొని శత్రుసేనలు నదికడ్డముగా వచ్చు మార్గమున సరిగా గుఱిపెట్టి కాల్చుటకు అనువుగా చేసుకొనుచుండిరి. ఒక చక్కని కుయుక్తిపన్ని మహామ్మదీయులు హిందూసైన్యములను కొన్ని మైళ్ళు ఒడ్డువెంబడినే దిగువకులాగి అకస్మాత్తుగ వెనుకకు మరలి నదివంకర తిఱిగినచోట యథాతీరమున తమ్మెదిరించుటకు ఎవ్వరునులేని ఇంగాలీజ్ వద్ద ఇదరికి వచ్చిపడిరి. సీవెల్ దొరగారు ఈ సమరతలము "బయాపురమను కుగ్రామము చెంత జరిగియున్నది. కాని కన్నడ మహారాష్ట్రచరిత్రలనుపట్టి చూడగా యుద్ధరంగముస్పష్టముగా రక్షజీటాంగడి (Raksha-

si–Tangdi) గ్రామములమధ్య జరిగెనని తెలుపుచున్నవి.”
కృష్ణానదీ తటమునకు పదిమైళ్ళ దూరమునగల మైదానములో యుద్ధము జరుగుట మాత్రము యథార్థము. యుద్ధారంభ సమయమున తన ఆప్తబంధుల హితోపదేశములను స్పష్టముగా అర్థము చేసికొనక, సరిగా విశ్వసించక, పర్యవసానములను దైవమునకే విడచిపెట్టెను. సమరతలమునకు వామపార్శ్వమును తిరుమలరాయునకును, దక్షిణపార్శ్వమును వెంకటాద్రికిని ఒప్పగించి తాను సేనాముఖమున మధ్యమరంగమును నడుపుచుండెను.

శత్రురంగమునకు ఎదుటిభాగమున వరుసగాగొలుసులతోడను, పగ్గములతోడను పిరంగులు చక్కగ కట్టబడి సురక్షితము కావింపబడెను. వానివెనుక దగ్గరవరుసలలో మత్తేభములు నిలుపబడియున్నవి. వాని దంతములకు వాడియగు ఈటెలమర్పబడియున్నవి. తుపాకులను ప్రేల్చుటకును ఫిరంగులను కాల్చుటకును గొప్ప అనుభవజ్ఞుడగు చలాబీరుమీఖాననను తురుష్కుని అధికారిగా నీ మించిరి.

రామరాజీ వ్యూహామునుచూచి సులువుగా యుద్ధమునందు జయమును నిశ్చయముగా పొందగలనను నమ్మిక గలిగియుండెను.కుడివైపును నడుపుచున్న తిరుమలరాజు గోల్కొండ సేనను వెనుకకు నెట్టివేసెను. కాని ఆ పని జరుగుసరి కాతని కొకకన్ను గాయపడినది. పాపమాతని కుమారుడు కూడ అదే సమయమునకు వీరస్వర్గమలంకరించెను. దీనితో రామరాజు

నకు క్రోధావేశము లొక్కమారుగా ముప్పిరి గొనెను. అందుచే నాతనికి మతి భ్రమణము కల్గెను. ఒక్కుమ్మడి నాతడు మధ్యమ రంగమున దూకి అహమ్మదు నగర సైన్యముల వెనుకకు కొట్టివేసెను. వెంకటాద్రిచే వెనుకకు త్రోలివేయబడిన ఆలీఅదిల్‌షా తిరిగి మధ్యమ రంగమున రామ రాజు పురోగమనము నరికట్టుటకై వచ్చెను. రుమీఖాను ఫిరంగులనుండి అగ్ని గోళములను గొప్ప యెత్తున విరజిమ్ము చుండెను. అయినను శాత్రవ సైన్యములు రెండువైపులను వెనుకకు కొట్టివేయబడి యుండుటచే హిందువులుతప్పకుండగ జయ మొందగలమను ధైర్యముతో విజృంభించు చుండిరి. శత ఘ్నుకాదళము భీకరముగ నిప్పుల గుప్పుచుండెను. మధ్యమ రంగమును మాత్రము విడువకుండ నిజాముషా గట్టిగ పట్టు కొనియుండెను.

ఇంతలో రామరాజు పక్షమున పోరుచుండు మహమ్మ దీయ సేనాధిపతులుఆకస్మికముగా శాత్రవసైన్యము లోనికి చొచ్చిపోయిరి. అది కాంచిన రామరాజుకు విస్మయ క్రోధ ములు ఆవేశించెను. వారంతటి స్వామిద్రోహులని యూహింప లేక రామరాజు వారిని నమ్మి వారికి సైన్యాధిపత్యములొసగి అత్యాదరముతో పోషించుచుండు వాడు. అందొకనిని మిక్కిలి ఆత్మీయునిగా భావించి ఎప్పుడును "సారా" అని ముద్దుగా పిల్చుచుండువాడు. అతని పేరు ఎయినల్‌ముల్కు. వారిరువు రును ఆత్మపక్షీయులేకదా యని హైందవయోధులు వారి నడ్డ

గింపలేదు. మహమ్మదీయులతో ముందుగనే రహస్యముగా ఆలోచించుకొని యుండిరి. కావుననే వారు వీరికి తోడనే ద్రోహమిచ్చిరి. మతాభిమానము పట్ల తురుష్కులకు ఏయితర ధర్మములును అడ్డుపడవు. ఈ సంగతిని పాపము రామరాయలు గుర్తెఱుగ దయ్యెను.

ఈ పరిస్థితులలో రామరాజుకు ఒడలు తిఱిగి పోయి కండ్లు చీకట్లుక్రమ్మెను. క్రోధ వీరావేశములతో ఒడలెఱుంగక పోరుచుండెనేగాని తానేమి చేయుచున్నదియును గుర్తెఱుగడు. నిజముగా ఆతనికప్పుడు స్మారకమేలేదు. అట్టి పరిస్థితిలో నతడు గాయపడెను. శత్రువులాతనిని పట్టుకొనిరి. అదే తడవుగా అహమ్మదు నగరసుల్తాను అతని శిరము ఖడించివేసి "ఇప్పటికి నా కసి తీరినది. భగవంతుడిక నన్నేమి చేసిననుసరే!" అనిబిగ్గఱగ నఱచెను. ఆదిల్షా తక్షణమే అచ్చోటు వ్రాలి తన జనక సమానుని ప్రాణములను రక్షించుడని ప్రార్థించుటకై త్వరపడు చుండెను. కాని కించత్పూర్వక్షణమందే కార్యము మించి పోయెను.

రాయలు శత్రువులచే ఖడింపబడెనను వార్త హైందవ సైన్యపరాజయ చిహ్నమై విజయనగర దశాతిరోగమనమునకు అంకురార్పణమైనది. ఫెరిస్టా లెక్కలను పట్టిచూడగా యుద్ధ రంగమునుండి తిరోగమించు సమయమున నిహతులలైన హైందవ యోధులసంఖ్య సుమారొక నూరువే లుండెను.

వెంకటాద్రి కాని తిరుమలరాయలు కాని సేనలను పురిగొల్పలేదు; సరేకదా! సమీపించుచున్న మహమ్మదీయుల నుండి నగరమును పరిరక్షించు కొనుటకైనను ప్రయత్నము చేయలేదు. వెంకటాద్రి దవ్వులనున్న ఏ చంద్రగిరికో తిరుపతి కోటకో పలాయనుడయ్యెను. కొంతకాలమెచ్చెచ్చటనో అజ్ఞాతవాసము చేసెను.

జయాధిపులగు సుల్తానులు రాజధానికి వెనుదిరిగి పోవుచున్న హైందవయోధులను ఎంతయో దవ్వు వెన్నాంటి తఱుమలేదు. యవన సేనాధిపులు హైందవ సేనా వాసములకు తిరిగి వచ్చి తమ భటులకు వారి యిష్టానుసారముగా దోచుకొనుటకు ఆజ్ఞలిచ్చిరి. అందు పైవారు విజృంభించి స్వేచ్ఛగా బంగారము, గుడారములు, ఆయుధములు, గుఱ్ఱములు మున్నగువానిని ఎవరికి దొరకినవి వారు ఆక్రమించుకొనిపోయి భాగ్యవంతులైరి.

ఆపదనుండి తప్పించుకొనివచ్చిన తిరుమల వెంకటాద్రులు ఇరువురును రాజకుటుంబమును బొక్కసమును తాత్కాలికముగా విజయనగరమునుండి తిరుపతికి తరలించి కొంతకాలము విజయనగరమును పాడువెట్టిరి. కొన్నాళ్ళ అనంతరమున మరల ప్రవేశించుటకు ఊహించిరి. వెంకటాద్రి చంద్రగిరికిని తిరుపతికిని త్వరపడిపోయెను. తిరుమలరాయలు నామమాత్ర చక్రవర్తిగానున్న సదాశివరాయలతోడను, రాజాంతఃపుర జనముతోడను అపార ధనకనకవస్తువాహనాధికములతోడను

సాళువ నరసింహరాయల కాలమునుండియు రాజుల మాన ధనప్రాణ రక్షణార్థముల కుపయోగించుకొనుచున్న తిరుపతి కొండలలోని రహస్య గృహనిలయములకు పయనమయ్యెను. అప్పుడు వారు తమతో తీసికొనిపోయిన ధన రాసుల విలువ అప్పటి స్వచ్ఛమైన ఇంగ్లీషు నాణెములతో సరిచూడగా నూరు మిలియనులకు మించి యున్నట్లు లెక్కించబడెను.

తిరుమలరాయలును అంతఃపుర కాంతలును పరివార జనమును రాజధానిని విడచిపోయిన తోడనే విజయనగరమున పురరక్షకు లెవ్వరును లేకపోయిరి. ఈ సంగతి గ్రహించి తురుష్కులు మరల పురమున ప్రవేశించి నగరమున భవనములను, వర్తకశాలలను, బీరారు నందలి ఆటవికజనమును గుంపులు గుంపులుగా తీసికొనివచ్చి నగరవాసులను స్త్రీ బాల వృద్ధ పురుష భేదము లేకుండ హింసించి దోపించుకొని పోయిరి. కొన్నాళ్ళకు జయము పొందిన సుల్తాను జయోత్సాహముతో మరల నగరు బ్రవేశించి వరుసగా దేవాలయము లన్నింటిని దోచుకొని ధ్వంసము గావించెను. విగ్రహముల నన్నింటిని పగుల గొట్టించెను. పురమెల్ల తగుల బెట్టించెను. రామరాజు వెనుక తమకు కావించిన మతవిధ్వంసక చర్యలన్నిటి యందును ఒక్కటికూడ విడువకుండ ప్రతిక్రియ కావించి విడచిపెట్టెను.

సుల్తానులు విజయ నగరమున కొంతకాలమున్న పిదప రామరాజుచే జయింపబడ్డ సుల్తానుల సరిహద్దులన్నియు మరల

వారి కొసగునట్లును. విజయనగర రాజ్యమును యథేచ్ఛగా హైందవులు పాలించుకొనుటకు వెంకటాద్రి వారితో సంధి గావించుకొనెను. తోడనే వెంకటాద్రి సోదరులు రాయచూరు నకువచ్చి ప్రజాపాలన మారంభించిరి. 1567వ స॥ జూలై ఆగష్టు మాసములలో తిరుమలరాజు విజయనగరమునకుతిరిగి వచ్చి నగర పునరుద్ధరణ చేయ ప్రారంభించెను. పోర్చుగీసు వారితో గుఱ్ఱముల వ్యాపారమును తిరిగి ప్రారంభించుటకు మొదలు పెట్టెను. అంతియేగాక మసల్మాను రాజుల రాజకీయములందుకూడ జోక్యము కలుగజేసుకొన నారంభించెను. అట్లు రెండు సంవత్సరములు నడచు నరికి ఇక దానెంత మాత్రమును ఇంక విజయనగరమునందుండి కాలక్షేపము చేయజాలనని, తోచి 1567వ సం॥ జూలై మాసమునందు తన రాజధానిని శాశ్వతముగా పెనుగొండకు మార్చెను. ఈ పర్యాయము తుదిసారిగా విజయనగరము పాడుపెట్టబడెను. 1568 వ సం॥ ము నాటి శాసనములలో నగరము పూర్తిగా ధ్వంసము కావింపబడినదని స్పష్టముగా చెప్పబడియున్నది. పెనుగొండను గురించి తొలుత వ్రాసిన వారి వ్రాతలలో 1489వ శాలివాహనశకమునకు సరియైన క్రీ॥శ॥ 1567–68 లలో సదాశివరాయలు చక్రవర్తిగా నుండెనని తెలియుచున్నది. మఱియు సీజరు ఫెడరిక్ గారి వ్రాతనుబట్టి "విజయనగరము, అప్పటికున్న విధానము" అను శీర్షికలో "విజయనగరిము పూర్తిగానాశనము కావింపబడలేదు. కొన్ని

ఝుండిఁకను నిల్చియున్నవి. కాని శూన్యగృహములు. వాని యందు పెద్దపులులును, ఇతర వన్యమృగములును తప్ప జను లెవ్వరు నందు నివసించుట లేదు." అని వ్రాసియున్నారు.

"The citie of Begenger is not altogether destroyed, yet the houses stand still, but emptie, there is dwelling in them nothing; and as is reported, but tygres and other wild beasts."

(Cesare Fedrici)

ఆంధ్రుల మహాసామ్రాజ్య విభవమగు విజయనగరము ఈ విధముగ అంతమొందినది. కాని ఆమహా శిథిలములు నిల్చి యున్నంతకాలమును దాని పూర్వ వైభవమును కూర్చియు, దాని మహాపురుషులను కూర్చియు ఇతిహాసముల గుఱించి యును మాత్రము మనము ప్రేమతో సంస్మరించుకొనుచుండ వలెను. ముందు యుగములకు అందించుచుండవలెను. అది మన కర్తవ్యము.

రామరాజు తన పాలనమున స్వార్థపరుడై అన్యాక్రాం తములు గావించి పరిజ్ఞాధరణ పోగొట్టుకొన్నవాడుగా, గాని, కర్కశహృదయుడుగా గాని ఉండలేదు. శ్రీకృష్ణదేవరాయల పాలనా చిహ్నములగు సమరనైపుణ్యములను, విజ్ఞానవిశ్వాస ములను ఇంతవఱకు తీసుకొని వచ్చినవాడు మాత్రమే అయ్యెను. రామరాజభూషణుడని పేరొందిన భట్టుమూర్తి యను తెలుగు కవియేగాక ఆతని యాస్థానమున సుప్రసిద్ధ

కీర్తనల రచించిన పురందరదాసుకూడ ఈతని యాస్థానమున పోషింపబడుచుండెను. ఉడిపి యందు శ్రీకృష్ణదేవాలయ నిర్మాణమున పురందరదాసువలెనే సహాయము గావించినట్టియు, వ్యాసరాయయోగి శిష్యుడును, అగు వదిరాజతీర్థులు కూడ ఈతని యాస్థానముననేయుండి సంస్కృతమునను, కన్నడమునను కూడ పెక్కు గ్రంథముల రచించెను. అప్పయ్యదీక్షితకృత మూర్థ్వ వేదాంతగ్రంథ గుణదోషవాదియగు విజయేంద్రతీర్థుడును, వీరశైవాధ్యాపకుడగు యెమ్మె బసవేంద్రుడును రాయలచే పోషింపబడుచుండిరి. శ్రీవైష్ణవపండితుడు తాతాచార్యులు ఆర్వీటివంశదానపత్రముల పెక్కిటియందు చెప్పబడియున్నాడు. 1586_1614 వఱకును పాలించిన మొదటి వెంకటరామలకు ఆతాతాచార్యుని కుమారుడును, తండ్రిని మించిన పండితుడును అగు లక్ష్మీకుమారతాతాచార్యులు గురువుగ నుండెను. అప్పయ్యదీక్షితుని "అద్వైతసిద్ధి"కి "చండామారుత"మను ఖండనమును వ్రాసిన చోళ సింహపురవాసుడు దొడ్డయాచార్యుడు కూడ అందే వర్ధిల్లెను. తెనుగు దేశమునందలి నాయకులలో రామానుజమతము సర్వసమ్మతము కావింపబడి 16 వ శతాబ్దాంతములో హిందూసామ్రాజ్యమునందంతటను ప్రబల విశ్వాసవంతమై ప్రబలసాగెను.

## తుళువ వంశము

ఈశ్వరనాయకుడు

నరసనాయకుడు

( 1491-1503 )



# ఆ ర వీ డు వం శ ము

సదాశివ రాయలు క్రీ॥ శ॥ 1570 లో తన మరణాంతము వఱకును నామమాత్రపు చక్రవర్తిగా పరిగణింప బడుచుండెను. యథార్థముగా అతడు జీవితాంతమును తిరుమల రాయని సంరక్షణలోనే యుండెను. 1567 వ సం॥ము నందలి కృష్ణాపురము శాసనములందాతడు తన దక్షిణ దేశపు పాలెగాండ్రచే అధికముగ గౌరవింపబడు చున్నట్లు తెలియుచున్నది. ఆతడెట్లు అంతరించెనో నిజముగ ఎవ్వరికిని తెలియరాదు, కాని పెక్కు కారణములబట్టి ఆలోచించగా ఆతడు తిరుమలరాయని పుత్రునిచే హత్య గావింపబడినట్లు మాత్రము ఊహించ వలసి యున్నది, సదాశివరాయని మరణముతో తుళువాన్వయమంతరించి నాలుగవదైన ఆరవీటివంశము ప్రారంభించినది. ఆరవీటి వంశమునకు ఈ తిరుమలరాయలే మూల పురుషుడు.

### తి రు మ ల రా య లు.

1570 లో తిరుమలరాయలు సింహాసన మెక్కుటకు కొన్ని అవాంతరము లుండియున్నను ప్రజాభీష్టము ప్రకారము తనంతటతానే కిరీటమును మాత్రము ధరించి పరిపాలింపసాగెను.

బీజపూరు సుల్తాను ధార్వారు బంకపురముల దురాక్రమణ గావించి కావించిన ఒత్తిడి నంతయు ఇతడు అంతకు ముందే చక్కగ తట్టుకొని నెట్టివేసెను. బీజపుర ప్రతినిధియగు ముస్తాఫా ఇప్పుడు తిన్నగ పెనుగొండ మీదకే చొచ్చుకొని వచ్చెను. అదేసమయమున అదిల్‌షా ఆదోనిని ముట్టడించెను.

విజయనగరమునుకూడా చుట్టుముట్టెను. తిరుమల నాయకుని నాయకులలో సవరము చెన్నప్పయను నతడు మిక్కుల సమర విద్యాచతురుడును, శౌర్యపరాక్రమములు కలవాడును. అదృష్టముచే అతడు తన నేర్పుచేత విజయనగరమును విడిపించి పెనుగొండనుండి మహమ్మదీయులను పాఱద్రోలెను. ఈతని పరాక్రమముచే పెనుగొండకు పెనుగండము తప్పినదికాని ఆదోని మాత్రము అదిల్షావశమైనది.

రాయల కుమారులందఱును యథాప్రకారము పెద్ద పరిపాలనాధికారులుగా నీమింపబడిరి. పెదకుమారుడగు శ్రీరంగ రాయలను పెనుగొండ రాజధానిగాగల ఆంధ్రప్రదేశమునకంతకును అధిపతిని కావించెను. రెండవ కుమారుడగు రామరాజును శ్రీరంగపట్టణము రాజధానిగాగల సమస్త కర్ణాట మండలములకును అధిపతినిచేసెను. మూడవ కుమారుడగు వెంకటపతిని చంద్రగిరి రాజధానిగా అఖిల తమిళ దేశములకును పాలనాధికారిగా నియమించెను. తిరుమలరాయలు "కర్ణాటక రాజ్యపునరుద్ధారకుడు" అను బిరుదు వహించెను. శ్రీరంగ రాయలు అనతి కాలముననే యౌవరాజ్య పట్టాభిషిక్తుడయ్యెను. ఈ రాజప్రతినిధులకు తోడుగా ఆయా మండలముల ముఖ్యవారసులగు సేనానాయకులు, తంజావూరు, జింజి, వెల్లూరు నాయకులను, మైసూరు మండల ఒడయారులును, కాలాడీపాలకులునుకూడ రాజ్యపాలనమునందెక్కుడుగా వీరికి తోడ్పడుచుండిరి.

తిరుమలరాయలు 1570 — 71 అంతమువఱకును మాత్రమే పాలించినట్లు తెలియుచున్నది. పెనుగొండ రాజధానీ నగరము కావింపబడినది. చంద్రగిరి ఉపరాజధాని కావింపబడినది. రాయలు భట్టుమూర్తిని ఆస్థానకవిగాచేసెను. అతని వాఙ్మయపోషణనుబట్టి పండిత భోజుడనికూడ పేర్వడసెను. తానుకూడ జయదేవుని గీతగోవిందమునకు స్వాయముగ వ్యాఖ్యానము వ్రాసెను. దానితో గ్రంథకర్తగాకూడ ఖ్యాతి పొందెను. చాకచక్యముతోకూడిన ధరణీవరాహుడని బిరుదు వహించెను. అనగా శత్రువులను మహాసముద్రమునుండి భూమిని ఉద్ధరించినవాడని యర్థము. ఈయన నాణెములకు నూతనరూపమును ఏర్పరచెను, అందొకప్రక్కను త్రిమూర్తి గోపురములను, రెండవప్రక్కను త్రిమూర్తుల రూపములను ముద్రింపించెను,

## శ్రీ రంగరాయలు.

శ్రీరంగరాయలు 1572 లో రాజ్యమునకు వచ్చి 1585 వఱకును పాలించెను. 1571 వఱకును యువరాజుగనే ఉండెను. ఆ వత్సరమునుండి 1586 వఱకును రాజ్యపాలన గావించెను. ఇతడు పట్టుదలకల వైష్ణవ మతావలంబి. పెక్కు దేవాలయములను పునరుద్ధరించెను. పెక్కుమంది పండితుల నాదరించెను. ఈతనిచే తిరిగి బాగుచేయించబడిన దేవాలయములలో దక్షిణార్కాడు జిల్లాలోని శ్రీముషనమును, మైసూరునందలి మేలుకోటయును, అహోబలమునందలి నరసింహస్వామివారి యాలయమును పేరుపొందినవి. ఈ యహోబలనరసింహస్వామి

పారియాలయము క్రీ॥శ॥1579 వ సంవత్సరములో గోలకొండ నవాబుయొక్క నాయకులలో నొకడును, మహారాష్ట్రబ్రాహ్మణుడు నగు మురహారిరావుచే దోపిడి కావించబడినది. శ్రీరంగ రాయలకు చెన్నప్ప ముఖ్యసేనాధిపతిగా నుండెను. ఇతడు మిగుల సమర్థుడును, పరాక్రమశాలియు నై యుండెను. ఇతడు అహోబలమునుండి ఇబ్రహీము కుతుబ్‌షా సైన్యములను, అతని సహాయుడగు మల్లికప్పనాయని సైన్యములనుకూడ తఱిమి వేసెను. ఈ శ్రీరంగరాయల కాలమునందే వైష్ణవమత ప్రవర్తకుయగు రామానుజాచార్యులు కీర్తిశేషుడయ్యెను. ఆ కాలమున శ్రీ రామానుజాచార్యులవారిని శ్రీవిష్ణువుయొక్క అపరావతారమని జనులు భావించెడివారు. చెంగల్పట్టుజిల్లాలోని శ్రీ పెరుంబూదూరునందలి అ మహాయోగి దివ్యసమాధి ఈ శ్రీరంగరాయలవారిచే ఎక్కువ వైశాల్యమైనదిగను, గొప్ప వైభవముగలదిగను చేయబడినది.

1580 లో ఇబ్రహీము కుతుబ్‌షా మరణించుటతో ముసల్మానుల దాడులతీవ్రత తగ్గినది. అహోబలముచుట్టునున్న ప్రదేశములను మాత్రము హిందువులు తిఱిగి స్వాధీనము కావించుకొన గలిగిరి. ముసల్మానులచే రెండుమూడు పర్యాయములు పెనుగొండ కుత్తరప్రదేశము ఎదిర్కొంచబడినది. అది బీజపుర సుల్తానగు అలీఅదిల్‌షాచే దృఢముగ పట్టుకొనబడినది. సరిగా ఆ సమయముననే ఉదయగిరి రాజ్యమునందలి విశేష భాగము గోల్కొండ నవాబగు ఇబ్రహీముకుతుబ్‌షాచే

స్వాధీనపఱచుకొన బడెను. అనంతపురమునందలి దేశచరిత్రలో రంగరాయలు బందీగా కొనిపోబడినట్లుకూడ చెప్పబడుచున్నది. కాని మహమ్మదీయుల చరిత్రమాత్రము దానినిధ్రువపఱచుట లేదు. వెంకటయల కునియూరు దాన శాసనములో రాయల రాజనీతి, స్వభావము, గొప్పగా పొగడబడియున్నవి. అతడష్ట దిగ్దేశములందును కీర్తి రాజిల్లించినట్లును, మిగుల సరళహృదయుని గను వర్ణింపబడి యున్నది. ఈయన ఆస్థానకవియగు రాయ సము వెంకటపతి తన లక్ష్మీవిలాస కావ్యమునందు యీతని యుద్ధప్రియత్వమును, వీరలక్షణములను మిగుల చక్కగా వర్ణించి యున్నాడు. శ్రీరంగరాయలకు సంతానముండెనో లేదో సంధిగ్ధముగ నున్నది. ఈతని తరువాత నీతని కనిష్ఠ సోదరుడు మొదటి వెంకటరాయ సింహాసనమునకు వచ్చెను.

## మొదటి వెంకటరాయలు.

ఇతడు క్రీ॥ శ॥ 1586 మొదలు 1614 వఱకును పాలించెను. ఆర్వీటివంశ ప్రభువులయందెల్ల నీతడే మిగుల నుత్తముడును, అసమాన పరాక్రమశాలియునై యుండెనని నిర్ణయింపబడెను. వెంకటరాయల రాజ్యము కృష్ణానదికి దక్షిణమున నున్న దక్షిణ హిందూదేశమునందలి విశేషభాగమునాక్రమించెను. హానోవరు మొదలగు మలబారు తీరమునందలి పడమటి రాజ్యమును, ఉత్తరమున భట్కాలు వఱకును, తూర్పు తీరమున కన్యాకుమారీ అగ్రము మొదలు ఉత్తర దిశగా 200 లీగులదూరము (బంగాళా తీరమున ఒరిస్సా రాజ్యము వఱకును) వ్యాపించి యుండెను.

రాయలు తన జీవితమునందు విశేషభాగమును చంద్రగిరియందే గడపినప్పటికిని రాజధాని పెనుగొండయనియే వ్యవహరింపబడుచుండెను. 1592 వ సం॥ము నందలి బీజపుర సుల్తానుల ముట్టడియనంతరము నుండియు రాయలు తనరాజ్యసభను చంద్రగిరికే శాశ్వతముగా మార్చెనని చెప్పబడుచున్నది. కాని అటుపిమ్మటనుకూడ పెనుగొండలోనే రాజ్యసభయుండియున్నట్లు అనేక లిఖిత పూర్వకములగు నిదర్శనములవలన స్పష్టముగా తెలియుచున్నది.

పిమ్మట అనేకములగు వ్రాతల యాధారములనుబట్టి చూడగా హంపి, హస్తినావతి, లేక విజయనగరము అనిపిలువబడు పెనుగొండయే రాజధానియని పేర్కొనబడుచుండుట గమనార్హమగు సత్యము. విజయనగరరాజ్య ప్రధానకార్యాలయములు ఎచ్చోట నుంచబడినను రాజధాని మాత్రము విజయనగరమనియే వ్యవహరింపబడుచుండెను. రాజనివాస మెక్కడనున్నప్పటికిని కార్యాలయములు మాత్రము విజయనగరమునందే నెలకొల్పబడి యుండినవి. హీరాసుదొరగారు 1652లో మఱల ప్రకటించిన "విజయనగరము, ఆర్వీటివంశము" అను తమ గ్రంథములో చిత్రించిన దేశపటమునందు చంద్రగిరిని విజయనగర సామ్రాజ్య పాలకుల నివాసము "బిస్నగరము లేక చంద్రగిరి" అని గుర్తించినారు.

వెంకటరాయలు తన పరిపాలన ప్రథమ సంవత్సరములలో ముమ్మరముగ మహమ్మదీయుల దాడులను ఎదుర్కొన

వలసి వచ్చెను. గోల్కొండసేనలు పెనుగొండలోనికి చొచ్చు కొని వచ్చుటను తంజావూరి నాయకుని కుమారుడగు రఘు నాథరాయలు తన భుజపరాక్రమముతో ఆతని నెదుర్కొని ఓడించి వెనుకకు మఱలించెను. రక్తసిక్తాపుణ వదనములతో జీవములను దక్కించుకొని పాఱిపోవుచున్న యవనవీరుల ఆర్త నాదములతో కొండగుహలు ప్రతిధ్వనించెను. నెత్తురు కారు చున్న శరీరములతో తురుష్క యోధులు పలాయనమొనర్చు పెన్నానది కడ్డముగా దారియు తెన్నును కానకుండ ఈదుకొని పోవుచుండ ఆ యేఱంతయు నెత్తురుచేత ప్రవహించెనని 1586వ సం॥ నాటి విలపాక దానపట్టాయందును దళవాయి అగ్రహార దానపట్టాయందును విశదీకరింపబడి యున్నవి. వెంకటరాజు కూడ ఉదయగిరి ప్రభువునకు కుతుబ్‌షా నెదిరించుటయందు సహాయపడి కొండవీటి వఱకును గల ప్రాంతమును, కృష్ణానది వఱకునుగల ప్రదేశమును దోచుకొనునట్లు చేసెను. తనకు కడు దవ్వునగల కళింకోట నరపాలుని యభ్యర్థనమును అంగీక రించి గండికోటను తిఱిగి స్వాధీనము చేసికొనుటలో అతనికి సహాయము చేసెను. ఆ సమయముననే వెంకటరాయలు కొండవీటిని తన రాజ్యమునకలుపుకొనినట్లు చెప్పబడుచున్నది. రామరాజీయమునందు కుతుబ్‌షా తనతో శాంతిని కోరి నట్లును, ఉభయరాజ్యములకును కృష్ణానదినే సరిహద్దుగా నెంచుకొనునట్లును సమ్మతించిరని చెప్పబడుచున్నది. కందుక యందలి 1613–14వ సంవత్సరము నందలి శాసనమునుపట్టి నెల్లూరు జిల్లా ఉత్తరభాగములపై అధికారమును ముసల్మా

నులే ఉంచుకొనుచున్నట్లు తెలియుచున్నది.

పడమటి భాగములపై ముసల్మానుల దురాక్రమణ కడుభయంకరముగా నుండెను. రాయలు రెండవ ఇబ్రహీము ఆదిల్‌షా నెదిరించుటకు అహమ్మదు నగర ప్రభువగు బర్హాన్ నిజాంషాయొక్క సాయమును కోరెను. రాయలు చంద్రగిరికి విశ్రాంతికేగిన సమయమును కనిపెట్టి అదిల్‌షా పెనుగొండను ముట్టడించెను, అప్పుడచ్చటి దుర్గాధ్యక్షుడగు మట్లఅనంతామాత్యుడు ధైర్యముతో ఎదిరించిసుల్తాను గర్వము సర్వము ఖర్వముగావించెను. ఈయుద్ధానంతరమునుండి కొన్నియేండ్లవఱకును మరల మహమ్మదీయులు శిరముఎత్తలేకపోయిరి. హిందువులు విశ్రాంతినిగైకొని హాయిగాస్వేచ్ఛావాయువులపీల్చుకొనిరి. హిందూరాజ్యముల బలపరాక్రమము లందుండు తరతమ భేదముల తెలిసికొనుటకై క్రీ॥శ॥ 1600 వ సం॥ములో ఢిల్లీ సుల్తానైన అక్బరుచక్రవర్తి యొద్దనుండి ఒకమొగలాయి రాయబారి రాయల సభాభవనమునకు వచ్చెను. అంతట ఆ రాయబారి దక్షిణహిందూ దేశమునందు బలపరాక్రమములతో స్వతంత్ర పరిపాలన గావించుకొనుచున్న విజయనగర హిందూ సామ్రాజ్యమును గుఱించియును, బీడరు, బీరారు, అహమ్మదునగరు, బీజపూరు గోల్కొండలనబడు బహమనీ రాజ్యముల గురించియును సవిస్తరముగా అక్బరునకు నివేదించెను. అంతటి బల పరాక్రమములుగల స్వతంత్ర రాజ్యములను అడచివేసి

తనకు సామంతులను కానించుకొనక పోయినచో ఎప్పటి కైనను మొగలాయి సామ్రాజ్యమునకు ముప్పు రాగలదని యోజించి అక్బరు దక్కనుపైకి దండయాత్రలను సాగించుచుం డెను. క్రమక్రమముగా దక్కనుపైకి మొగలాయీల దండ యాత్రలు ముమ్మరము కాజొచ్చెనవి. ఇది గ్రహించి దక్షిణ హిందూదేశమునందలి హిందూ మహమ్మదీయ రాజ్యము లన్నియు నొక్కటిగా కూడగట్టుకొని మొగలాయీలు దక్క నులో అడుగు పెట్టకుండ చేయవలెనని మంతనములు సలుపు చుండిరి. ఈసమయమున రెండవతూరి అక్బరు విజయనగరము నకు మఱియొక రాయబారి నంపెను. అప్పుడు రాయలా రాయబారితో నిట్లు చెప్పెను. "నా రాజ్యము భగవంతుని చేతిలో నున్నది. ఆయన నన్ను ఆ సామ్రాజ్య పీఠమునుండి త్రోసివేయ దలచినచో ఎవ్వరాపగలరు? అంతవఱకును సత్యము. ఏది ఎట్లైనను నేనొక ముసల్మానుని పాదములపై వ్రాలను. ఆ మొగలాయి చక్రవర్తి మాపై కెప్పుడెత్తివచ్చి నను రావచ్చును. నేను నా జాతికై పోరాడుదును. యుద్ధము తథ్యము." అని స్పష్టముగా ప్రత్యుత్తర మిచ్చినట్లు చెప్ప బడుచున్నది.

1593వ సంవత్సరమున ఆదిల్‌షా ఒక దండయాత్రను పడమటి కన్నడ దేశము, మైసూరులవైపు నడిపించెను. కాని మైసూరుపై బిజాపురమువారి ఆధిపత్యము ఎంతయో కాలము నిలువలేదు. శ్రీరంగ పట్టణము తుదిరాజ్య ప్రతినిధియగు తిరు

మల రాయలనుండి మైసూరు వెంకటరాయల అనుమతిని రాజా ఒడయారు చేత తీసుకొనబడెను. 1612 లో రాజా ఒడయారునకు శ్రీరంగపట్టణముపైన అధికారము శాశ్వతముగ ఇచ్చివేయబడెను.

దక్షిణముననున్న నాయకులతో రాయలకుగల సంభధము మిగుల హృదయపూర్వకమైనది. కాని కేవల అధికారముతో కూడుకొనినది మాత్రముకాదు. తంజావూరి అచ్యుతప్ప నాయకుడు ఎల్లప్పుడును. అసమానమైన ప్రభుభక్తి పరాయణుడుగా నుండెను. ఆతని తరువాతివాడగు రఘునాథరాయలుకూడ ఆవిధముగనే 1610 వఱకు నుండెను. జేసీట్ దొరగారి లేఖల యందెంతయో గొప్పగావ్రాయబడిన జింజి ప్రభువు కృష్ణప్పనాయకుడు మాత్రము ఒకటి రెండు సారు లెదురు తిఱుగు చుండెను. కాని వెంటవెంటనే అడచివేయబడు చుండెను. మధురాపురి వీరప్పనాయకుడుకూడ 1592 వఱకును కొంచెము కొంచెము తలయెత్తుచునే యుండెను. కానితోడ్తోన అదుపులోనికి తీసుకొని రాబడుచుండెను. అప్పుడప్పుడు కప్పములను చెల్లించక పోవుచుండినప్పటికిని ఆతని తరువాతవారు మాత్రము ప్రభుభక్తి పరాయణులుగనే ఉండుచుండిరి. వెల్లూరి ప్రభువు లింగమనాయకుడు 1603 లో తనకు రాజ్యమిచ్చిన జింజిప్రభువు మీదను, వెంకటరాయల మీదను, కూడ తిఱుగు బాటు చేసెను. చెన్నప్పనాయకుని శౌర్యసహాయమున రాయలాతనిని తన చేతిక్రిందకు తీసుకొనివచ్చుటకై బంధించెను.

దానితో రాయలకు వెల్లూరు రెండవరాజధానీ నగరముగనేర్ప డినది. అంతటినుండియు ఆయూరు రాయవెల్లూరని పిలువబడు చున్నది.

ఈవెంకటరాయల కాలములోనే తూర్పుతీరమున తొలుదొల్త డచ్చివారును, ఇంగ్లీషువారును ప్రవేశించిరి. వెంక టరాయలసభలో పోర్చుగీసువారి పరిచయ సహాయముతో డచ్చివారు పులికోటరేవున దిగుటకు ఒప్పందపత్రమును పొందు టకు ప్రయత్నించి కృతకృత్యులైరి. అట్లు వారు స్థిరపడిన పిమ్మట పోర్చుగీసుప్రభువు సేనమునకు వారు ప్రక్కలోని బల్లెములైనట్లు సుస్పష్టమైనది. అందుచే సేనము డచ్చివారి పులికోటకోటను లాగుకొనెను. డచ్చివారు వెంకటరాయల పరిపాలనాంతములోగా పులికోట స్థావరమును తిరుగ సంపా దించుకొనిరి. ఆ ప్రాంతమున తమవ్యాపారమును సాగించుకొను టకు ఇంగ్లీషువారు ప్రబలయత్నములు కావించిరి. కాని సేనము వారియెత్తులు సాగనీయలేదు.

వెంకటరాయలు పోర్చుగీసు మతవ్యాపకులకు గొప్ప స్నేహితుడయ్యెను. వారితో తఱచుగా మతచర్చలు కావించు చుండువాడు. కాని వారు తమ యత్నమునందెంతమాత్రమును సఫలురు కాజాలకపోయిరి. వెంకటరాయలను తమ మతము లోనకు త్రిప్పుకొనలేకపోయిరి. అందులకువారు "ద్వారము గట్టిగ మూయబడినది. దానిని తెరచుటకు భగవంతుని కృప యెక్కువ కావలెను" అని తమలోదాము గొణుగుకొనుచు

ఆ ప్రయత్నమునుండి విరమించిరి. హీరాసుద్వార ప్రకటించిన క్రైస్తవ మతసంబంధములైన లేఖలను పట్టిచూడగ మతవిషయ ప్రస్తావనలలో రాయల సహనబుద్ధియు. వాదోపవాదము లందలి సాహస ధైర్య చాతుర్యములును అమోఘములును, ప్రశంసనీయములును అయియుండెను.

వెంకటరాయల సుప్రసిద్ధమంత్రియగు మట్లఅనంతామాత్యుడు కదనమునందేకాక కననమునందు కూడ కడునేర్పరియై "ఇదంశస్త్రం మిదంశాస్త్రమను"ను ప్రజ్ఞాధురంధరుడై యుండెను. ఇతడు సిద్ధౌతుని, అతని కుమారుడగు తిరువెంగళనాథునికూడ బలపరచెను. దిగువ తిరుపతి దేవాలయ గోపురమును తన స్వంతద్రవ్యముతో కట్టించెను. వెలుగోటినాయకుడగు యాచమనాయకుడుకూడ ఆ కాలమునొందొక గొప్పసైన్య మతానలంబియగు సుప్రసిద్ధాంధ్రభూపతి. గొబ్బూరి ఓబరాయలు కూడ ఆకాలమున నొక ప్రసిద్ధనాయకుడును రాయలకు మామగారును నై యుండెను. రాబోవు విజయనగర సింహాసన వారసత్వపు యుద్ధములలో తానేరాజునని ప్రకటించిన వాని పక్షములో గొబ్బూరినాయకులు ముఖ్యులు. లక్ష్మీ కుమారతిరుమలతాతాచార్యులు రాయలకు గురువై అతని ప్రాపకమున గొప్పయాదరము నొందెను. తాతాచార్యులు తన పాండిత్యమహిమను క్రైస్తవ మతగురువులుకూడ ప్రత్యక్షముగా తెలిసికొనగలుగునట్లు చేసెను. వెంకటరాయల పాలన తంజావూరి నాయకుల ముఖ్యమంత్రియగు అప్పయదీక్షితులతోసహా చెన్నబసవ పురాణకర్తయగు విరూపాక్ష పండితు

డును, జైనవ్యాకరణ పండితుడును కవియునగు భట్టలంక దేవుడు మొదలగు మహాసాహిత్య మతిగురువులను పోషించుటలతో గొప్ప కీర్తిని పొందియుండెను.

రాయల ఆస్థానమునందు తెలుగు సాహిత్య పోషణము యెడలకూడ ప్రత్యేక శ్రద్ధవహించబడెను. మల్ల అనంతామాత్యుడే కాక పింగళిసూరనామాత్యుడు, తెనాలిరామకృష్ణుడు మొదలగు తెలుగు కవులుకూడ పోషింపబడుచుండిరి. తెనాలి రామకృష్ణుడు వికట కవిగా ప్రసిద్ధి పొందియున్నాడు. అతని చమత్కృతి అనేకమైన హాస్యప్రసంగముల మూలమునను పరిహాసములతో కూడిన అనేక చాటుపద్యముల మూలము నను దక్షిణ హిందూదేశము నందంతటను జనులందరిచేతను కొనియాడబడి వ్యాప్తినొందినది.

ఇతడు తన సోదరకవులమీదను తుదకు రాయల మీదనుకూడ తన చమత్కార హాస్యములను ప్రయోగించెడి వాడని తెలియుచున్నది. తాను సమయస్ఫూర్తిగా చురుకైన హాస్యము ఆశుకవనములో చెప్పుచుండువాడు. అతడు తాతాచార్యునకు తగులునట్లు చమత్కరించినట్లుగా చెప్పబడుచున్న అనేక ఇతిహాసములను పట్టిచూడగా వారిరువురు సమకాలికు లని దృఢపడుచున్నది. చమత్కార భాషణమునందాతడు బర్బాలుతో సమానమగు కీర్తి నార్జించెను. అంతేగాక ఆతని సాహిత్య ప్రకర్ష తానువ్రాసిన పాండురంగ మహాత్యమువలన స్పష్టముగా తెలియుచున్నది.

———

ఆరవీడు వంశము.

ఆరవీటిబుక్కరాయలు

రామరాజు

శ్రీరంగరాయలు.

అళియరామరాజు (1542-64) — తిరుమలరాయలు (1) (1570-71) — వెంకటాద్రి.

1 వ. శ్రీరంగరాయలు (2) (1572-85) — రామరాయలు — 2వ వెంకటరాయలు (3 (1586-1614)

పెదతిరుమలరాయలు — శ్రీరంగరాయలు — తిరుమల (తిమ్మరాజు) — 2వ శ్రీరంగరా (1614) (4)

శ్రీరంగరాజు

3వ వెంకట (6) (1630-42) — చినవెంకట — రామదేవరాయలు (5 (1618-30)

3వ శ్రీరంగరాయలు (7)

మొదటి వెంకటాద్రి కుమారుడయిన శ్రీరంగరాజు కొడుకగు కాందనవోలు గోపాలరాజుకు దత్తుడు (1642-9)

# సామ్రాజ్య పతనము

వెంకటరాయల మరణమాతని తరువాతివారిమధ్య దుఃఖకరమైన వారసత్వపు యుద్ధములకు దారితీసినది. వెంకటరాయలకు పెక్కురు భార్యలుండిరి. కాని ఒక్కరియందును ఆయనకు సంతతి కలుగలేదు. రాయలకొకానొక ఆమెయందు మక్కువ యెక్కువ. ఆమె ఒకదాసీ పుత్రుని పుట్టిన వెంటనే తీసికొని తను కన్నబిడ్డడని ప్రకటించెను. కాని వెంకటరాయలకా కార్యమునం దెంతమాత్రమును ఇష్టము కలుగలేదు. అతని అవసాన సమయమందు తన చిన్నన్నగారగు రామరాజు రెండవకుమారుడైన రెండవ శ్రీరంగరాయలకు పట్టాభిషేకము గావించవలెనని చెప్పి కాలధర్మమునొందెను. శ్రీరంగరాయలు దుర్బలుడును, తెలివితక్కువ వాడును అగుటచేత వెంకటరాయల ప్రియపత్ని తనపుత్రుడని చెప్పుకొను పిల్లవానిని రాజును చేయదలచి తన అన్నగారగు గొబ్బూరి జగ్గరాయల సహాయముతో సింహాసనమునకు తగవు లేవదీసెను. దానితో రాజసభలోని మహానాయకులు రెండుపక్షములైరి. తెలివితక్కువ వాడగు శ్రీరంగరాయలు పాపము ఎంతన్యాయ ప్రయాసములు పడినను చట్టబద్ధమైన తనన్యాయమును ఋజువు చేసికొనలేకపోయెను. అతడున్నతోద్యోగులను మార్పులుచేసియు ప్రజలపై అధిక శుల్కముల విధించియు ప్రజాదరణ గోల్పోయెను. వెలుగోటి యాచమనాయకుడు మాత్రము శ్రీరంగరాయల పక్షము వహించెను. తిమ్మనాయకుడు మాకరాజు అను

వారి సహాయముతో జగ్గరాయలు శ్రీరంగరాయలను సకుటుం బముగా చెఱయందుంచెను. చాకలివాని సహాయముతో రహస్యముగా ఎట్లో యాచమనాయకుడు శ్రీరంగరాయల రెండవ కుమారుడగు రామదేవుడను చంటిబిడ్డను మాత్రము రక్షించగలెను. కొందఱు చరిత్రకారులు ప్రాణాపశిష్ట సమయములో శ్రీరంగరాయలనుకూడ యాచమనాయకుడు రక్షించెనని చెప్పుచున్నారు. మొత్తమున జగ్గరాయయి శ్రీరంగరాయల కుటుంబమునంతను దారుణముగా హత్యగావించెను.

ఈదారుణ హత్యకారణముగా దేశమందంతటను అల్లకల్లోలము చెలరేగినది. 1614-16 వఱకును రెండేండ్లపాటు దేశమరాజకమై ధర్మబద్ధమైన సింహాసనము కొఱకు యుద్ధములు సాగుచునే యుండెను. ఇట్లు పెక్కుయుద్ధములు జరిగిన పిమ్మట తుదకు కావేరినది పెద్దయానకట్టకు సమీపమునగల టోహారని పిలువబడు టొప్పూరునొద్ద జరిగిన పెద్దసమరములో అదృష్టవశమున ఈ సమస్య పరిష్కారమైనది. గొప్ప సామంతులలో నొకడైన తంజావూరు రఘునాథరాయలు మాత్రము యాచమనాయకుని పక్షమున ప్రభుభక్తిపరాయణుడై నిలిచెను. మిగిలిన పెద్దనాయకులందఱు జగ్గరాయలకే సాయము చేసిరి. ఆయుద్ధములో తుదకు జగ్గరాయలు పడిపోయెను. అంతట తంజావూరు రఘునాథరాయలు రెండవ కుమారుడగు బాలుడు రామరాయలును సార్వభౌమునిగా పట్టాభిషేకము గావించిరి. జగ్గరాయల సోదరుడు యతిరాజులును,

జింజినాయకుడు మధురనాయకుడును రఘునాథరాయలచే లోబఱుపబడిరి.

ఈ వారసత్వపు యుద్ధములో నిజమైన యోధాగ్రే సరుడును, సామ్రాజ్యరక్షకుడను విఖ్యాతుడగు అస్వాదుడునుఅయిన వాడు ఒక్క వెలుగోటి యాచమనాయకుడే! కాని యీ వార సత్వపు కలహములచే నాటనుండియును ప్రజలయందును పాల కులయందునుకూడ సత్యము, ధర్మమును దూరమైపోయినవి. మధురాపాలకుడగు ముత్తు వీరప్పయు అతనితరువాత 1627-59 వఱకును పాలించిన తిరుమలనాయకుడు మొదలగునాయకరాయల ప్రభుత్వమును బాహాటముగా కాదనుచుండిరి. 1630-42 వఱకును పాలించిన మూడవ వెంకటరాయల పరిపాలన కూడ అందులకు తగినట్లుగానే ఉండెను. 1642 లో సింహాసన మెక్కిన మూడవ శ్రీరంగనాయకులు ఉత్తరమున ముసల్మా నుల ఒత్తిడితోబాటు సామంతరాజుల రాజద్రోహ కార్యము ములను అవినీతి కార్యములను తిరుగుబాటులనుకూడ అడచు టకై చాల గట్టియత్నముల జేసెను.

టొప్పూరు యుద్ధానంతరమొక అర్ధశతాబ్దముపాటు పలుచికాకులతో ఎట్లో కడచెను. ఇంతలో 1654 వ సం॥ ములో షహాజీ మరణించుటతో మైసూరురాజు నడుమను కలుగజేసికొని హిందూసామ్రాజ్యముపైబడి కబళించివేయు టకై చూచుచున్న బీజపురసుల్తాను నెదిరించి నిలువరించి కొంత సేవను చేసెను. కాని చిట్టచివఱకు సుల్తాను బలాఢ్యు

డగుటచే చిటల్‌దుర్గము, తుమకూరు, కోలారు మండలము లను, బెంగుళూరు జిల్లాలోని సగము భాగమును తనవశము చేసి కొనెను. సామ్రాజ్యము ఇట్టిచిక్కులతో సతమత మగుచున్న కాలములో మధురనాయకుడు తన విషయమునగాని, సామ్రాజ్యము పట్లగాని కొంచెమైనను జోక్యము కలిగించుకొనలేదు 1642 లో చంద్రగిరియందు మూడవ శ్రీరంగరాయలు సింహాసన మెక్కునరికి సామ్రాజ్యము అతి క్లిష్టపరిస్థితులలో పడిపోయెను. దక్షిణదేశపు సామంతులకు రాజభక్తి సర్వశూన్యమై పోవుటచేతను, వారిలో ముఖ్యముగా మధుర తిరుమలనాయకుడు అతిబలవంతు డగుటచేతను, సార్వభౌమునకు ఎల్లప్పుడును తిరుగుబాటుదారుల ఒత్తిడినితట్టుకొనుటలతోడనే సరిపోయినది రాయలీ నాయకులను దనయెడల భయభక్తులు కలిగి వినయ విధేయతలతో మెలగునట్లు చేసికొనుటకు కొన్ని క్రమశిక్షణా చర్యలను ప్రవేశపెట్టెను. కాని అవి యెంతమాత్రమును కార్యకారులు కాలేక పోయెను.

సామ్రాజ్య మీవిధముగా ఒంటరిగా నిస్సహాయమై గోల్కొండనవాబు యొక్కయును అతని యనుయాయులగు మీరుజుమ్లా యొక్కయు, రాయల ప్రతిసిధుల యొక్కయు, అప్రతిహతములగు ఘాతములను భరించవలసి వచ్చెను. మధుర నాయకుడు సామంతమండలిలో నెల్ల మిగుల బలవంతుడై యుండియు హైందవ సామ్రాజ్యవినాశన హేతుభూతములగు మూలకారణములను తెలిసికొన యత్నించక తన సహాయ

నిరాకరణమును, తఱచు తానొనర్చు కుతంత్రములును
చక్కగా నడచునట్లు చూచుకొనుచుండెను. అవి యన్నియు
ఎప్పటికప్పుడు వెల్లడి యగుచునేయుండెను. కాని మొత్తము
నకు సామ్రాజ్య పతనమున కవియే మూలకారణములైనవి.

దక్షిణమున బెడనూరు మొదలు నెల్లూరువఱకును గల
విజయనగర సామ్రాజ్యమును, దాని సామంతమండలములసైత
ముగా విశేషభాగములను జయించి హిందువుల పిత్రార్జితమగు
విజయనగర సామ్రాజ్యము మహమ్మదీయుల చేజిక్కకుండగ
కాపాడిన బీజపూరు మహారాష్ట్ర ప్రభువును మాత్రమెన్నడును
మనము మఱువరాదు. అతడు విశేష శ్రమకోర్చి ఆయాప్రదేశ
ములందలి అవిధేయపాలకులను తప్పించి ఆయాస్థానములలో
సువిధేయులగు మహారాష్ట్ర నాయకులను ప్రవేశపెట్టి హిందు
వుడై పుట్టినందులకు హైందవరాజ్య గౌరవమును కాపాడుటచే
అతడు మనకెంతయు స్మరణీయుడు. అతని కుమారుడు వెంకోజీ
1675 లో తంజావూరి తుదినాయకునినుండి రాజ్యమును
స్వాధీనము గావించుకొని అచ్చట నొకటిన్నర శతాబ్దముల
కాల మొక మహారాష్ట్ర వంశమును నిలిపెను.

---

# ★ సింహావలోకనము ★

## పరిపాలనము

విజయనగర ప్రభుత్వ నిర్మాణమునందు చక్రవర్తి సర్వులకు శిఖరమువంటివాడు. సమస్త రాజ్యపాలన పద్ధతికి ఉన్నతాధికారి. న్యాయమునకు చిట్టచివరి అధికారి. ఆతడు తన పురజనులను కన్నబిడ్డలవలె పాలన పోషణములు చేయుచుండెను. సామ్రాజ్యమునందలి సైనిక వ్యవహారములను స్వయముగానిర్వహించుచుండెను. పలువుర మంత్రులయొక్కయు, రాష్ట్రసేనాధిపతులయొక్కయు సలహా సహకారములందుచుండెను.

పరిపాలనా సౌకర్యముకొఱకు సామ్రాజ్యము కొన్ని రాష్ట్రములుగా విభజింపబడినది. వానికి నాడులు లేక కొట్టములని పేరు. అందు గ్రామవిభజనము చేయబడినది. ఇట్టి విభాగములు రమారమి రెండువందల వఱకుండెను. వానికి గవర్నరులు పాలనాధికారులుగా నుండిరి. యథార్థమునకు ప్రతిపాలకుడును ఆ విభాగమునకు ఒక సామంత భూపాలుడుగనే వ్యవహరించెను. ఈ పాలకులు రాజధానియందే ఉండి వారి ప్రతినిధుల సహాయముతో పరిపాలనము చేయుచుండెడివారు. రాష్ట్రములు సామ్రాజ్యమునకు పరిపుష్టిని కలిగించునవియై యుండెను.

పరిపాలనమునకు గ్రామము ఒక చిన్న కేంద్రముగా నుండినది. గ్రామపంచాయితీలుసక్రమముగనడుపబడుచుండెను.

గ్రామమునకొక గ్రామసభకలదు. వంశ పారంపర్యముగవచ్చు "అయగారులు" స్థానిక వ్యవహారములను చక్కబెట్టు చుండిరి. కొందఱు ఉద్యోగులు పన్నులను వసూలు చేయుచుండిరి. ఈ గ్రామపరిపాలనము చక్రవర్తికి ప్రజలకుమధ్య గొప్పసామరస్యము చేకూర్చినది. పెద్దపెద్ద నగరములందు స్థానికమైన గువర్నరులే పన్నులు వసూలుచేయుటయు, న్యాయ పరిష్కారములు గావించుటయు, పరిపాలనా విధుల నిర్వహించుటయు గలదు. ఈ గవర్నరులు వీరికి నిర్ణయింపబడిన భూమిపన్నులను సామ్రాజ్యాధిపతికి చెల్లించుచు, అవసర సమయములందు తగినంత సైన్యమును సిద్ధపఱచి చక్రవర్తికి పంపవలసియుండెను. దేశాచారమునననుసరించి ధర్మశాస్త్రము అమలు జరుపబడుచుండినది.

విజయనగరరాజుల కాలమునాటి రాజకీయాపరాధములకు (Criminal offences) శిక్షాపద్ధతి క్రౌర్యముగను, అనాగరికముగ నుండెను. దొంగతనమునకు వికలాంగునిగా జేయుట, బందిపోటు దొంగతనములకు హత్యలకు వ్యభిచారములకు మరణమును, రాజద్రోహమునకు కొఱతవేసి చంపుటయు ఏనుగులచే త్రొక్కించి చంపించుటయును ఆచరణమున గలవు.

ప్రభుత్వమునకు భూమిపన్ను ఒక్కటియే ప్రధానాదాయముగ నుండెను. కర్షకులు తమ మొత్తముపంటలో పదింట తొమ్మిది పాళ్ళు ప్రభుత్వమునకు సుంకముగ చెల్లించుచుండిరను విదేశీయుల వ్రాత విశ్వసింప దగినదికాదు. ఎప్పుడెప్పుడు ఎంత

యెంతభాగములు రైతులు చెల్లింపవలసినదియు ఆ యా భూముల సారాసార భేదములనుబట్టి యుండెడిది. మొదటి హరిహరరాయల కాలమునుండియు పన్నులు ధాన్యరూపమున సేకరింప బడుచుండినను ప్రభుత్వము ప్రజలకు ఉద్యోగులకును చెల్లింపవలసినది మాత్రము నాణెముల రూపముననే ఉండెడిది. రైతులపై తఱచుగా అధికమైన పన్నులు విధింపబడుచుండెను. కొందఱు రైతులు పన్నుల భారమునుండి తప్పించుకొనుటకు ఇతర దేశములకు పోవుచుండుటయు గలదు. వేశ్యలపైకూడ పన్నులు వేయబడు చుండెను.

సామ్రాజ్యమునకు ఉత్తరపు సరిహద్దున దురాశాపరు లగు సుల్తానులుండుటచే సైన్యమును పూర్వుల కాలమునాటి నిష్పత్తి ప్రకారముగ పోషించు కొనవలసియుండుట విజయ నగర ప్రభువులకు తప్పనిసరి పనిగా నుండెను. మాన్యాల పద్ధతిపై రాష్ట్ర సేనాధిపతులు సైన్యమును చక్రవర్తులకు యుద్ధ సమయములందు పంపవలసి యుండెను. దేవరాయాదులు ముస్లిము సైనికులను తమ సేనాబలములోనికి చేర్చుకొనిరి. కాని ఆ ప్రయత్నము విఫలమైనది. విజయనగర ప్రభువుల సైన్యము ఎక్కుడుగ గజబలములపై ఆధారపడియుండెను. ముస్లిముల గుఱ్ఱపుదండును చూచి హిందూరాజులుగూడ అట్టి సైన్యాభివృద్ధికై ప్రయత్నించిరి. కోటలను బాగుచేయించి బలపఱచిరి. పిరంగుల బలముమాత్రము తక్కువే. సైనికుల సంఖ్య ఎక్కువగా నుండినను మొత్తముమీద సైన్యశక్తి అధికముగాదు.

మ త ము

హిందూమతమును పునరుజ్జీవన సంరక్షణముల గావించు సదుద్దేశముతోనే విజయనగర సామ్రాజ్యము స్థాపింపబడినది. ఆ చక్రవర్తుల పోషణముచే దక్షిణ దేశమునందు హిందూ మతమునకు ఒక నూతన జీవనము కలిగినది.

ఈ కాలమునందు విష్ణుభక్తులగు రాజులుండుటవలన శ్రీవైష్ణవ మతము మిగుల ప్రభావముతో విజయ వీధుల విహరించినది. వైష్ణవమత ప్రఖ్యాత పోషకులయందు తిమ్మన దండ నాయకుడు ముఖ్యుడు. తన మతాభిమానమునకు గుర్తుగ ఈతడు మేలుకోటలో అనేక ధర్మకార్యములను దానములను గావించెను. ఈ రాజుల పోషణముననే విఠల పూజాపద్ధతియు, తెంగలై (Thengalai) వైష్ణవమును వైభవస్థితికి వచ్చినవి.

కొందరు వైష్ణవరాజులు అప్పుడప్పుడు శైవకర్మ కాండయు అనుష్ఠించుచువచ్చిరి. సంగమ వంశరాజులు శైవమతావలంబులు. మొదటి హరిహరరాయలు, మొదటి బుక్కరాయలును క్రియాశక్తి శిష్యులు. ఆ క్రియాశక్తి ఒక పాశుపతుడై యుండును.

రాయల వంశమువారందరు అద్వైత శృంగేరీమఠముతో విశేష సన్నిహిత సంబంధము గలిగియుండిరి. మల్లికార్జునుని కాలమువరకు రాజులు అమూల్య వస్తు వాహన ధన రాసులను ఏటేట ఆమఠమునకు సమర్పించుచుండిరి. విద్యాశంక

రుడు, విద్యారణ్యమాధవుడు, సాయనుడును అమితాదరముతో చూడబడిరి. మాధవసాయనులు వేదములకు బ్రహ్మాండమైన వ్యాఖ్యానములను రచించిరి. శృంగేరీ పీఠమునకు సంగమ వంశములోని ప్రభువులకుంగల పరస్పర గౌరవ సహాకారముల ఫలితముగ వేదవిజ్ఞానము సంస్కృతవిద్యయు అనూన ప్రోత్సాహములందెను. బ్రాహ్మణమత పునరుద్ధరణము ఆకాలములో మిక్కిలి శక్తి సంపన్నత గావించెను.

విజయనగర రాజులు ఏమతస్థులైనను వారి పరమతసహనము నిరుపమానము. వారెట్టి మతభేదాభి ప్రాయములులేక ఉద్యోగములిచ్చియు దానములిచ్చియు ప్రఖ్యాత పురుషులైరి. వేర్వేఱు మతపండితులగు అప్పయదీక్షిత, వ్యాసతీర్థ, వేదాంత దేశిక, తాతాచార్యాదులు వీరి పోషణమునందు వర్ధిల్లిరి.

మొదటి బుక్కరాయల మతసహనబుద్ధి శ్లాఘనీయమైనది. ఆతడు జైన వైష్ణవుల వివాదమునకు న్యాయమైన పరిష్కార మిట్టిచ్చెను.

"If loss or advancement should be caused to the Jaina darsana through the Bhaktas, the Vaishnavas will kindly deem it as loss or advancement caused to their own darsana"

దీనిని బట్టి ఆ రాయలయందు అశోకమహారాజుని తత్త్వము (Asokan spirit) వెల్లడియగుచున్నది. స్వీయ మత విధ్వంసకశక్తుల రూపుమాపి మహాసామ్రాజ్యమును

స్థాపించుటయు, ఆతరువాత పరమత సహనము జూపుటయు ఈతనిలోగల విశేషగుణము. మత రాజకీయ విరోధులగు మహమ్మదీయులు హిందువులతో సమముగ చూడబడుచుండిరి. హిందూప్రభువులు వారిమత కర్మకాండలయందు జోక్యము కలుగ జేసికొనెడివారు కారు. రాజధానిలో మహమ్మదీయులు నివసించుటకు రెండవ దేవరాయలు సహన ప్రోత్సాహములు చూపి మార్గదర్శకుడాయెను. ముస్లిముల సంకల్పముల గౌరవించుటకు రెండవ దేవరాయలు, రామరాయల వంటి రాజులు తమసభలందు సింహాసనమునకుముందు కురాను గ్రంధము లుంచెడివారు. అచటకు వచ్చి ఇస్లాము మతస్థులు నమస్కరించు నాచారముగలదు. హిందువుల పవిత్రమైన గోవులను వధించుట ముస్లిముల మతస్వాతంత్ర్యముగ అంగీకరింపబడినది. క్రైస్తవుడుగాని యూదుడుగాని మరొకమతస్థుడు గాని విజయనగరమున నిరుపద్రవముగ తన మతానుసారముగ వచ్చుచు పోనగునని బర్బోసా వ్రాసియున్నాడు.

ఆకాలమునందు మతసహనము ఒక ధర్మమైయున్నది. సాంఘిక రాజకీయముల సామరస్యము ఎక్కడాపశ్యక మాయెను. జైనము. శ్రీవైష్ణవము, స్మార్తము, మాధ్వము, వీరశైవము మున్నగునిట్టి వివిధమతములు ఒకదాని ప్రక్కనొకటి ఐకమత్యముతో మెలగినవి. బేలూరులోని కేశవదేవుని ప్రార్ధనము మతసహనశక్తికి సర్వోత్కృష్టమైన ఉదాహరణముగ చెప్పవచ్చును- చూడుడు: "ఎవనిని శైవులు శివునిగా,

వేదాంతులు బ్రహ్మముగా, బౌద్ధులు బుద్ధునిగా, నైయాయికులు కర్తగా, జైనులు అర్హముగా, మీమాంసకులు కర్మగా, వైష్ణవులు విష్ణువుగా ఆరాధింతురో ఆ కేశవదేవుడే మీ కోరికల నిరంతరము ఫలింపజేయుగాత!"

## సంఘజీవితము

విజయనగర రాజ్యము వివిధజాతులతోను వివిధ ప్రజలతోను నిండియుండెను. అప్పటి చక్రవర్తులు సంఘైకమత్యము నకు తమ సర్వశక్తులను వినియోగించిరి. బ్రాహ్మణులు ప్రభు సేవా పరాయణులుగనుండి తమ మేధాసంపదను ప్రదర్శించిరి. ప్రభువులు భోగలాలసత గలిగి ఆనందమయ జీవితముల గడపిరి. వీరిమనోహరజీవితములు పెక్కువిదేశీయుల నాకర్షించినవి.

ఆకాలమున భూషణములు, పరిమళద్రవ్యములు, తములపాకులు లోనగు భోగకరవస్తువులు, చుఱుకు పుట్టించు అనేక పదార్థములును మిక్కిలి అక్కరగా నుండినవి. విదేశీయుల వాణిజ్యము ఇచట చురుకుగా అభివృద్ధిగాంచినది. ఆహార విషయములో పెక్కునియమములు గానరావు. మాంసాహారము నిషేధము కాదు గాని గోమాంసము మాత్రము పరమ నిషేధము. అన్నిజంతువులు బజారులందు బాహాటముగా విక్రయింపబడుచుండెను. మద్యము నే గాక మైరియా (Maireya) అని పిలువబడు సారా కూడ వాడుకలో గలదు.

బహుభార్యాత్వము వేశ్యాగృహాగమనమును వ్యవహారములో నుండెను. అప్పుడప్పుడు సుందరవేశ్యలు ప్రభువుల

ప్రత్యేకాదరాభిమానములకు పాత్రులగుచుండిరి. సతీసహగమనముగలదు. రాజొకడు మరణింపగా ఆతనితో ఆతని సన్నిహితవర్గముగూడ దగ్ధముగావింపబడిరి." అని ఒక లేఖరి వ్రాత తెల్పుచున్నది.

వేట, మల్లయుద్ధము, ముష్టియుద్ధము గుఱ్ఱముల పైనుండి యాడెడు బంతులాటలు, సంగీతము, నాట్యము, నాటకములు మున్నగునవి ఆనాటి ప్రజల వినోదక్రీడలు. ద్వంద్వయుద్ధములు చేయుట సర్వసాధారణముగ ప్రభుత్వము సమ్మతించెడిది. కాని అట్టియుద్ధము చేయగోరువారు మంత్రులనుండి ముందుగ అనుమతి పత్రములను పొందవలసి యుండెను.

రాజనగర స్త్రీలు సగౌరవముగ చూడబడుచుండిరి. జ్యోతిష్కులు, రాజోద్యోగములుచేయు స్త్రీలు, మల్లయుద్ధము చేయుస్త్రీలుగూడ గలరు. నగరప్రజలు ధనధాన్య సంపదలతో తులతూగుచుండిరి.

వ్యవసాయము, తానులుగాబట్టలునేయుట, గనులనుండి వజ్రములనుతీయుట, ఖనిజములు త్రవ్వుట, ఉప్పు తయారు చేయుట లోనగునవి అప్పటి ప్రజలముఖ్యవృత్తులు. విదేశీయుల వాణిజ్య మున్నతస్థితి యందుండెను. ఆనాడు వర్తకసంఘములు శిల్పిసంఘములును గలవు.

## విజయనగరశోభ

దేదీప్యమానములగు రాజభవనములతోను ప్రజల సకల విద్యాభివృద్ధితోను కూడిన విజయనగరశోభ ఆనాటి

వారికి అత్యంతాకర్షణీయములైనవి. క్రీ. శ. 1378 నాటికి విజయనగర చక్రవర్తులు బహామనీ సుల్తానులకన్న అధికారమునందు, బలపరాక్రమములందు, ఐశ్వర్యమునందును మిన్నలైరి. ఫిరోజిషాతోడి దేవరాయల పుత్రికయొక్క వివాహబంధము ఆనాటి రాజధానీశోభకు దోహదకారి యయ్యెను.

1420 లో నికోలోడికాంటి విజయనగరమును సందర్శించి, దానివైభవమును బలిష్ఠములగు దుర్గముల ఘనతను వర్ణించెను. 1443 లో దర్శింపనేతెంచిన అబ్దుల్‌రజాక్ విజయనగరమంత గొప్పపట్టణమును ప్రపంచ మందెచ్చట తన్నెన్నడు చూడలేదనియు చెవి యెన్నడు వినలేదనియు వ్రాసియున్నాడు.

"The city of Bijanagar is such that eye has not seen not ear heard of any place resembling it upon the whole earth"

1522 లో పెయిసు (Paes ) విజయనగమును సందర్శించి ఆశ్చర్య చకితుడాయెను. అపుడు సామ్రాజ్యము కృష్ణదేవరాయల విజయాభ్యుదయ పరంపరలచే విలసిల్లినది. విజయనగరము రోమునగరమంత విశాలముగ నుండినదట. ఒక లక్షకుమించి గృహములుండినవి. జన సాంద్రత మిక్కుటము. భిన్నభిన్న జాతులప్రజలతో నగము కనులపండుగ నుండెను. విదేశవణిజులు పెక్కులుండిరి. ఆమహానగరము సర్వశుభలక్షణ సముపేత మనబరగినది.

## సాహిత్యము

ఈ యుగమందు మహాసాహిత్య సంచలనము ముందంజ వేసినది. కొందఱురాజులు గొప్పపండితులు కవులుగూడనై

యుండిరి. ఉత్తమ సాహిత్యగ్రంథ రచనము సాగుటతోబాటు అనేక చక్రవర్తులు యశఃఫలము లందుకొనిరి. హిందూమతమును ఉద్ధరించుటకు మతవేదాంత గ్రంథములనేకములు రచింపబడినవి. సంస్కృతాంధ్ర కర్ణాటక వాఙ్మయములు అపార గుణసేనధులై విరాజిల్లినవి. సర్వోత్తమ కవులందు వేదాంత దేశిక, మాధవవిద్యారణ్య, సాయనాచార్య, గంగాదేవి, మధుర, ఆయతివర్మ, భీమకవి, లక్కన్న, బమ్మెరపోతన, అరుణగిరినాథ, కలమేఘ, శ్రీకృష్ణదేవరాయ, వ్యాసతీర్థ, పురందరదాస, నరసింహకవి, అప్పయ్యదీక్షిత, వేమన, కనకదాస, హరిదాస, వల్లభ, కుమారసరస్వతి, అల్లసాని పెద్దనాది అష్టదిగ్గజములు ముఖ్యులు. ఆంధ్రసారస్వతము శ్రీకృష్ణదేవరాయల యుగములో స్వర్ణయుగమని ప్రసిద్ధివడసినది.

## శిల్పము

రాజభవనములు, శ్రీవిరూపాక్ష, విఠల, హజార రామస్వామి మొదలగు దేవాలయములు ప్రభుత్వకార్యాలయములు మున్నగువాని శిల్పవిన్యాసములలోని లోకోత్తరసుందర ప్రతిభాతేజములు వేనోళ్ళ కొనియాడబడుచున్నవి. వీనిని సందర్శించిన విదేశీయుల విస్మయానంద ప్రశంసలకు మేరలేదు.

## శిథిల దృశ్యములు

ఈ సమస్తవైభవము తల్లికోటవిజేతల విద్యాశతృత్వముచే నాశనము గావింపబడినది. నేడు ఆ హంపీశిథిలములు ఆంధ్రహృదయ విదారకములై తమదైన్యస్థితిని వ్యక్తము చేయుచున్నవి.

"మానవుని హస్తమందేని మనుసతంబు?
కాలమెప్పుడు తనుదాన కదలుచుండు,
ఉన్నతిని కొంచెమేనియు నుంచలేదు.
నాశనము వెంబడించె నతియునశించె.

ఐన నింకను ఆగడ్డ నధివసించి
పడినగోడలు నగరాగ్ర భాగములును
సౌధశిథిలాలు ఆత్మీయ చరితలెల్ల
చాటుచున్నవి కన్నీరు మీటుకొనుచు"

ఈ విధముగ హైందవ విజయనగర సామ్రాజ్యమును, దాని సర్వసమత్వముగల రాజధానియు మూడుశతాబ్దముల కాలము తూర్పు రాజ్యములకుగాని, పడమటి రాజ్యములకుగాని ఎంతమాత్రము తీసిపోనంతటి పారిశ్రామిక, వ్యావసాయిక, శిల్ప, లలితకళావిభవములతో వర్ధిల్లినవి. అట్టింతకాలము ఏకచ్ఛత్రముగ ఆంధ్రుల సంస్కృతి విశేషముల నిలబెట్టిన మహాంధ్ర సామ్రాజ్యము నాడేకాదు సర్వకాలములందు సర్వమానవులు స్మరింపదగిన పవిత్రఘట్టము. ఈ విజయనగర సామ్రాజ్యము దక్షిణ హైందవ ప్రతిభకు ఒక దివ్యాకృతిగ నిలచియున్నది.

—:◆:—